# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా కాన పరిశోధనం వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పరమెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒకే డబ్బా నెలల తరబడి వస్తుంది...




...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL

# ఫోస్ఫోమిన్





శక్తిని పెంపొందించును.

ఆకలిని అధికము చేయును.





సహనశక్తిని హెచ్చించును.

శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్






SQUIBB®

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A /67 Tel

9

# ఇప్పుడే...
# మీ సహాయం
# అవసరం!

"మన మందరమూ ఒకే జాతికి చెందినవారము. మనమంతా ఒకే ప్రజ. బీహారు, ఉత్తరప్రదేశ్, ఇతర అనావృష్టి ప్రాంతాలలో వచ్చిన ఆపద యావద్భారతదేశానికే వచ్చిన ఆపద. మనమంతా కలిసి అనావృష్టి పరిస్థితుల్ని ఎదుర్కోనాలి. కష్టసుఖాలను మనమంతా కలిసి పంచుకోవాలి. ఉజ్వల భవిష్యత్తుకు మనం ఐక్యంగా కృషి చేయాలి."

**ఇందిరా గాంధి**
ప్రధాన మంత్రి

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధికి
ఉదారంగా విరాళ మివ్వండి.

విరాళాలను నగదు రూపంలో కానీ, వస్తు రూపంలో కానీ
ఈ క్రింది చిరునామాకు పంపండి.

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధి,
క్యాబినెట్ సెక్రటేరియట్, రాష్ట్రపతి భవన్,
న్యూ ఢిల్లీ - 4.



బలము మరియు శక్తి కోసం!

బాలుకు మామూలుగా తనమిత్రుడు జయవిలాస్ హోటల్ జయరాంతో ఆట్టే కబుర్లేసుకు కూర్చోటమంటే ఇష్టం. ఒకనాడు.......


















# అతనికి ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను నేర్పండి

దూరప్రదేశాలను గురించి తెలుసుకోవాలనుకుంటే మీ బిడ్డ మిమ్మల్నే అడుగుతాడు. మీ దగ్గర నుండి అనేక ముఖ్య విషయాలు నేర్చుకుంటాడు. అందులో ఒకటి ఫోర్‌హాన్స్‌తో సరియైన దంతసంరక్షణ. అది ఎట్లా తన పళ్ళను కాపాడుతుందో, ఎట్లా దంతక్షయమును నివారిస్తుందో నేర్చుకుంటాడు.



ఒక దంతవైద్యునిచే నిర్మింపబడ్డ యీ టూత్ పేస్టులో బిగువైన పళ్ళకు చిగుళ్ళకు కావలసిన ప్రత్యేక మందులున్నాయి. అవి మీకు, మీ బిడ్డకు మంచివి. అందుచేత, ఇప్పుడు ఇకముందు పళ్ళ జబ్బులు రాకుండ ఎట్లా కాపాడుకోవాలో అతనికి నేర్పించండి. ప్రతి ఉదయం, రాత్రి ఫోర్‌హాన్స్ వాడేటట్లు అతనిని ప్రోత్సహించండి. జీవితాంతం అవసరమైన దంతసంరక్షణ...ఇప్పుడే నేర్పించండి.

## జాగు చెయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి



ఉచితం: "పళ్ళు చిగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అనే పుస్తకం. రంగుచిత్రాలలోనున్న ఈ పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. మీ భాషలో దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 10 పై. బిళ్ళలు పంపండి. అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో. పోస్టు బ్యాగు నం. 10031. బొంబాయి-1.

పేరు..............................................................

అడ్రసు..............................................................

* మీకు కావలసిన భాష క్రింద గీతపెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలోకెల్ల ముఖ్యమైనది కావచ్చు

**ఫోర్‌హాన్స్** టూత్ పేస్టు—ఒక దంతవైద్యుడు నిర్మించినది

"C. 1"

CMGM-188 TL

అశోకా రిజిష్టర్డు
అమ్లా
బ్రిలియంటైన్

నేడేమో మీ క్రాఫు వెంట్రుకలు
చాల నీటుగా అందంగా
ప్రకాశిస్తూ వున్నాయి






ఓ! అదా అది అశోకా అమ్లా బ్రిలియంటైన్ ప్రభావం ఒక అందమే కాదు మెదడుకు చల్లగా హాయిగా వున్నది. యిందు అమలక, భృంగ, వట్టివేరు, చందన, కేతకి, మొదలగు మంచి ఓషధులు, అత్తరువులు చేరియున్నవి గాన వేసవిలో చాల మేలు కలుగజేయును

**విజయా కెమికల్సు** మద్రాసు-7.

---

# A GREAT NAME IN HANDLOOMS

## AMARJOTHI
FABRICS

**BEDSPREADS**

**FURNISHINGS**

**& TOWELS**

MFG: **AMARJOTHI FABRICS**
POST BOX NO 22 KARUR.

G.H.RAO



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అల్పులూ, అనామకులూ అయినవారు చిత్తశుద్ధితో సాగించే పవిత్రకార్యాలను ఘనులైనవాళ్ళు తమ కీర్తి ప్రతిష్ఠల కోసం విస్తృతపరిచి, కలుషితం చేస్తారు. ఈ నీతిని "పుణ్యజలం" అన్న కథ చక్కగా నిరూపిస్తుంది.

శక్తిమంతులు శక్తిహీనులతో సహజీవనం చెయ్యగోరినప్పుడు తమ శక్తిని అవతలివారి దౌర్బల్యాన్ని సరిచెయ్యటానికే ఉపయోగించినప్పుడు సహజీవనం సాధ్యమవుతుంది. ఈ నీతి "సహనశీల" [బేతాళకథ]లో ఉన్నది.

సంపుటి 42 అక్టోబర్ '67 సంచిక 4

CHITRA

# భారత చరిత్ర

యూరపులో ఏడేళ్ళ యుద్ధం ప్రారంభమైన కారణంగా మన దేశంలో ఇంగ్లీషు, ఫ్రెంచి వర్గాల మధ్య యుద్ధం సాగినట్టు మనం లోగడ తెలుసుకుని ఉన్నాం. కాని ఈ యుద్ధం కర్ణాటకంలో వెంటనే సాగలేదు. కారణమేమంటే మద్రాసు ప్రాంతంలో ఉభయపక్షాల బలాలూ లేవు. బెంగాలులో యుద్ధం సాగించటానికి క్లైవ్, వాట్సన్‌లు ఇంగ్లీషు సైనిక, నౌకాబలాలను తరలించుకపోయారు. పుదుచ్చేరి నుంచి అక్కడి ఫ్రెంచి గవర్నరు ఫ్రెంచిబలాలను హైదరాబాదులో ఉన్న బుస్సీకి సహాయంగా పంపాడు.

1758 లో కర్ణాటక ప్రాంతంలో కూడా ఇంగ్లీషు ఫ్రెంచి పక్షాల మధ్య యుద్ధాలు సాగాయి. ఫ్రాన్సు నుంచి కొత్త బలాలు పంపబడ్డాయి. అయితే ఫ్రెంచి సైనిక, నౌకాశాఖల మధ్య సామరస్యం లేని కారణంగా ఫ్రెంచిపక్షం చాలా నష్టపోయింది. ఒక వంక ఫ్రెంచి సేనలు ఒక్కొక్క ఇంగ్లీషు స్థావరాన్నే జయించుకు వస్తూంటే, ఫ్రెంచి నౌకాబలం బ్రిటిషు నౌకాబలానికి ఓడిపోయింది (ఏప్రిల్ 28). నౌకాబలం యొక్క సహాయం లేకుండా ఫ్రెంచి సేనలు మద్రాసును జయించటం సాధ్యం కాలేదు. అయితే సంవత్సరాంతం లోపల ఫ్రెంచి సేనలు ఇంగ్లీషువారి స్థావరాలలో మద్రాసు, తిరుచిరాపల్లి, చెంగల్పట్టులు తప్ప మిగతా అన్ని ప్రదేశాలనూ జయించి, డిసెంబరు 14 న మద్రాసును ముట్టడించాయి. అయితే ఈ ముట్టడి నిరుపయోగమయింది.

ఆ తరవాత ఫ్రెంచివారి అపజయం పూర్తి కావటానికి ఒక సంవత్సరం మాత్రమే పట్టింది. ఫ్రెంచి సేనాపతి అయిన లాలీ అనేవాడు పెద్ద పొరపాటు చేశాడు—అతను హైదరాబాదు నుంచి బుస్సీని పిలిపించి,

## 73. ఫ్రెంచివారి ఓటమి

అక్కడి ఫ్రెంచి సేనను అసమర్థుల చేతిలో పెట్టాడు. ఆ అవకాశం గ్రహించి క్లైవు బెంగాలు నుంచి కర్నల్ ఫోర్డ్ అనేవాడి నాయకత్వం కింద సర్కార్లకు ఒక సేనను పంపాడు. ఈ ఇంగ్లీషుసేన ఫ్రెంచిసేనను జయించి, రాజమహేంద్రవరాన్నీ, మచిలీపట్టణాన్నీ ఆక్రమించుకుని, నిజాం సలాబత్ జంగ్‌తో ఇంగ్లీషు కంపెనీకి అనుకూలమైన సంధి చేసుకున్నది.

కర్ణాటక ప్రాంతంలో కూడా ఫ్రెంచివారికి అపజయమే సంప్రాప్తమయింది. ఆదిలో కంజీవరం వద్ద వాళ్ళు ఇంగ్లీషువారిని ఓడించగలిగారు గాని, అటుతరవాత ఫ్రెంచి సైనికుల అసంతృప్తివల్ల తిరుగుబాటు కూడా సంభవించింది.

చివరకు 1760 జనవరిలో వందవాసి వద్ద ఫ్రెంచి సైనిక బలాలు యుద్ధం సాగించి, ఇంగ్లీషుబలాల చేతిలో తిరుగులేని పరాజయం పొందాయి.

1761 జనవరి 16 న పుదుచ్చేరి నగరం ఇంగ్లీషు సేనల వశమయింది. ఇంగ్లీషు వారు పుదుచ్చేరిలోని స్థావరాన్నే కాక, నగరాన్ని పూర్తిగా ధ్వంసం చేసి, "ఒక్క ఇంటిమీద కూడా కప్పులేకుండా" చేసేశారు. దాని తరవాత మరి రెండు ఫ్రెంచి స్థావ



రాలు—జింజీ, మలబారు తీరాన ఉన్న మాహే—ఇంగ్లీషువారి వశమయాయి. ఇక ఫ్రెంచివారికి ఇండియాలో స్థావరాలేమీ మిగలలేదు.

ఫ్రెంచివారి పరాజయానికి కారణాలు ఎన్ని ఉన్నప్పటికీ, బెంగాలు ఇంగ్లీషువారి అధీనం కావటమే వారి విజయాలకు మూల కారణం. బెంగాలు నుంచి మద్రాసుకు అంతులేని సేనలనూ, ధనాన్నీ ఇంగ్లీషువారు తరలించగలిగారు. ప్లాసీయుద్ధం యొక్క సద్యః ఫలితమే ఫ్రెంచివారి ఓటమి. "బెంగాలు ఇంగ్లీషువారి కింద ఉండగా పుదుచ్చేరి స్థావరంగా పెట్టుకుని నెపోలియ



21

నంతటి వాడైనా ఓడిపోక తప్పదు,'' అని ఒక చరిత్రకారు డన్నాడు.

సైనికంగా బెంగాలు ఇంగ్లీషువారి ఆధిపత్యం కిందికి వచ్చినప్పటికీ రాజకీయంగా పెద్ద మార్పులు కలిగిన లక్షణాలేవీ పైకి కనబడలేదు. నవాబు పదవికి సిరాజుద్దౌలా స్థానంలో మీర్ జాఫర్ వచ్చాడు. నవాబు దర్బారులో ఇంగ్లీషువారి రెసిడెంటు ఒకడు మాత్రం అదనంగా ఏర్పడ్డాడు. అయితే మీర్ జాఫర్ మనుగడ కేవలమూ క్లైవు చేతిలో ఉన్నది.

1758 జూనులో కలకత్తా కౌన్సిలువారు క్లైవును బెంగాలుకు గవర్నరుగా ఎన్నుకున్నారు. ఈ ఎన్నిక పైన ఇంగ్లీషు కంపెనీ సంవత్సరాంతంలో తన ఆమోద ముద్ర వేసింది. అయినప్పటికీ క్లైవు స్థానం సందిగ్ధంగానే ఉండిపోయింది. అవతల నవాబున్నాడు. అయితే ఆ నవాబు చర్యలను క్లైవు శాసిస్తూ వచ్చాడు. ఇది మీర్ జాఫర్‌కు ఏ మాత్రమూ నచ్చలేదు. అయితే బ్రిటిషువారి సైనికబలం తనకు అండగా లేకపోతే అతను అధికారంలో నిలవలేడు. ఈ మాట ప్రత్యక్షంగానే (1759 లో) రుజువయింది.

అలీ గౌహర్ (రెండవ షా ఆలం) అనే వాడు బెంగాలు, బిహారులను ఆక్రమించగోరి పట్నా నగరాన్ని ముట్టడించాడు. క్లైవ్ సహాయంతో మీర్ జాఫర్ ఆ ప్రమాదాన్ని నివారించుకోగలిగాడు.

ఈ విధంగా ఇంగ్లీషువారిపై ఆధారపడటం ఇష్టంలేక మీర్ జాఫర్ చిన్సురాలోని డచ్చివారితో రహస్యాలోచనలు సాగించాడు. ఇంగ్లీవారి స్థానాన్ని కాజెయ్యాలన్న తహతహతో డచ్చివారు జావా నుంచి తమ బలాలను పిలిపించ యత్నించారు. కాని ఈ యత్నాన్ని క్లైవు పడగొట్టి, 1759 నవంబరులో బేదారా వద్ద డచ్చివారిని ఓడించి, సంధికి ఒడబరిచాడు.






ఒకప్పుడు ధరణీపురానికి దివాకరు డనే ప్రతాపశాలి రాజుగా ఉండేవాడు. ఆయన ఒకసారి శత్రురాజుతో యుద్ధం చేసి, గెలిచి సైన్యాలతో తిరిగి వస్తూండగా, దారిలో, ధరణీరాజ్యపు పొలిమేర లోపల ఉండే పెద్ద ఎడారి ప్రాంతం మధ్య రాజుకు దాహమయింది. అది నిర్జలప్రాంత మని తెలిసి కూడా, ఎక్కడైనా గుక్కెడు నీళ్ళు దొరుకుతా యేమోనని రాజభటులు అన్ని పక్కలకూ బయలుదేరారు.

ఒక దిక్కుగా వెళ్ళిన వారికి ఒక చోట చిన్న పల్లమూ, దాని అడుగున చిన్న గుంటా, అందులో మూడు నాలుగంగుళాలు మాత్రమే లోతుగల నీరూ కనిపించాయి. నీటిని చేతిలోకి తీసుకుని నోటిలో పోసు కుంటే కొబ్బరినీళ్ళ లాగా రుచిగా, శుచిగా ఉన్నది. భటులు సంతోషించి, చిన్న లోటాతో చెంబునిండా నీరు తోడి తీసుకు పోయి, రాజు కిచ్చారు. రాజా నీటిని తాగి, "ఈ ఎడారిలో అమృతం లాంటి నీరున్నదా? ఎన్నడూ వినలేదే!" అన్నాడు.

ఆయిన స్వయంగా వచ్చి పల్లంలో ఉన్న గుంటనూ, అందులోని నీటినీ చూశాడు. ఆయన పరివారంలో ఎంత మందికైతే దాహమయిందో, అంత మందీ ఆ గుంట లోని నీరు తాగారు. ఎంతమంది తాగినా గుంటలోని నీరు తరగలేదు.

రాజు అక్కడే ఆ పూటకు మజిలీ చేసి, గుడారాలు దింపించాడు.

ఆ సమయంలో అక్కడికి ఒక సన్యాసి వచ్చి, పల్లంలోకి దిగి, గుంటలోని నీళ్ళు నెత్తిన చల్లుకుని, దానితో ముఖం కడు క్కుని, నీరుతాగి, రాజును చూడవచ్చి, ఆశీర్వదించి, "ఇది పుణ్యజలం! దీన్ని తాగే భాగ్యం ఇంత కాలానికి నీకు కలగటం నీ అదృష్టం," అన్నాడు.

హెచ్. రామకృష్ణ




"దీన్ని ఎందుకు పుణ్యజల మంటున్నారు? ఇందులో ఏమిటి విశేషం?" అని రాజు సన్యాసిని అడిగాడు.

సన్యాసి ఇలా చెప్పాడు:

"ఒకప్పు డిక్కడ ఈ పల్లం కూడా లేదు. ఎండా కాలంలో ఒకనాడు వాన కురిసింది. మర్నాడు ఎండ దెబ్బకు తట్టుకోలేక ఎగురుతూ ఉన్న పిచ్చుక ఒకటి ఇక్కడ పడిపోయి, గిజగిజా తన్నుకుంటూ, ముక్కుతో నేలను పొడిచింది. కాస్త తడి దాని ఒంటికి తగిలింది. దానికే ఆ పిచ్చుక తెప్పరిల్లి, బలం వచ్చి, ఎగిరిపోయింది. అప్పు డక్కడ చిన్న గుంట అయింది. తరవాత ఆ గుంటలో వాననీళ్ళు కొంచెంగా నిలిచాయి. నోరెండి పోయిన ఒక గద్ద వచ్చి ఆ గుంటను ఇంకా కొంచెం పెద్దది చేసి నీరు తాగి పోయింది. తరవాత ఈ ప్రాంతంలో ఉండే నక్కలూ, తోడేళ్లూ నీటి కోసం ఈ గుంట దగ్గిరికి వచ్చి, మట్టిని ఇటూ అటూ చెదరగొట్టి గుంటను ఇంకా పెద్దది చేశాయి. క్రమంగా అడవి పందులూ, అడవి ఎనుములూ చిన్న గుంటను ఒక పల్లంగా తయారుచేశాయి. రాను రాను ఇందులో ఏనుగులు కూడా పొర్లాయి. పల్లం చాలా లోతూ, వెడల్పూ అయింది. వానలు బాగా కురిసినప్పుడు పల్లం నిండుతుంది. ఎంత ఎండా కాలమైనా దీని అడుగున బెత్తెడు లోతు నీరుండి, ఎడారిలో తిరిగే ప్రాణులకు దప్పిక తీర్చుతున్నది. ఎడారి కంతకూ ఇదే జలాశయం. ఇందులోని జలం పరమ పవిత్రమైనది. నేను ఎప్పుడూ ఇక్కడికే వచ్చి నీరు తాగుతుంటాను."

ఈ సంగతి చెప్పి సన్యాసి వెళ్లిపొయ్యాక రాజు కొక ఆలోచన వచ్చింది. ఎంతమంది తాగినా పల్లం దిగువన ఉన్న నీరు ఏ మాత్రమూ తరగలేదు. దాన్ని బట్టి ఆ నీరు భూమి అడుగున చాలా విస్తృతంగా ఉండి ఉండాలి. అక్కడ ఒక

పెద్ద చెరువు తవ్వించినట్టయితే మంచి లోతూ, విస్తీర్ణమూ గల జలాశయం ఏర్పాటయి, ఎడారి కుండా ప్రయాణించే వారికి ఎంతో ఉపయోగంగా ఉంటుంది. అందువల్ల తనకు శాశ్వతమైన కీర్తి కలుగుతుంది.

ఇలా ఆలోచించి దివాకర మహారాజు ఆ పల్లం ఉన్నచోట పెద్ద చెరువు తవ్వించి, సమీపంలోనే ఒక సత్రం కట్టించి, అక్కడ విశ్రాంతి తీసుకునే వారికి వన్యమృగాల బాధ లేకుండా, చెరువుకూ, సత్రానికీ కలిపి చుట్టూరా ఎత్తయిన ప్రహరీగోడ కట్టించి, అక్కడ అహోరాత్రాలు రక్షకభటులను కాపు కూడా ఉంచాడు. ఆ చెరువుకు దివాకరసరోవరం అని పేరు పెట్టాడు.

చెరువు పూర్తి అయాక, పూజా అదీ జరిగింది. ఆ సమయంలో చెరువు నీరు రాజు కాస్త ఆచమనం చేశాడు. అప్పుడాయనకు ఆ నీరు కొంచెం కటువుగానూ, వాసనగానూ ఉన్నట్టు అనిపించింది. కొత్తగా తవ్విన చెరువు కావటంచేత అలా ఉండి ఉంటుందనుకున్నాడు.

ఆ చెరువు తన కెంతో ప్రతిష్ఠ తెస్తుందని రాజు ఆశించాడు. అందుచేత దాన్ని ఎంత మంది ప్రయాణీకులు వాడుకుంటున్నారో, వాళ్ళు దాన్ని గురించి ఎంత గొప్పగా చెప్పు



కుంటున్నారో ఆయన విచారించి తెలుసుకుంటూ ఉండేవాడు. చెరువునీరు స్నానాలు చెయ్యటానికి తప్ప తాగటానికి పనికిరాదని అందరూ చెప్పుకోసాగారు. చెరువు వద్ద ఉన్న సత్రాన్ని కనిపెట్టుకుని ఉన్నవారూ, రక్షకభటులూ దాని నీరే తాగవలిసి రావటం చేత చాలా బాధపడుతున్నారు. వాళ్ళు తమను అక్కడికి పంపవద్దని కూడా రాజు గారిని వేడుకున్నారు.

రాజు హతాశుడయాడు. "అక్కడికి రోజూ ఒక సన్యాసి వస్తున్నాడే, ఆయనను ఒకసారి నా దగ్గరకు పంపండి," అని రాజు భటులతో అన్నాడు.

"చెరువు తవ్వాక సన్యాసి ఎవరూ అటు కేసి రాలేదు," అని భటులు ఆయనకు జవాబు చెప్పారు.

రాజుకు మరింత ఆశ్చర్యమయింది. ఆయన భటులతో, "చెరువుకు సమీపం లోనే ఎక్కడో ఆ సన్యాసి ఉంటాడు. వెతికి తెలుసుకుని, ఆయనను నా వద్దకు పంపండి," అన్నాడు.

కొద్ది రోజులు గడిచాక సన్యాసి వచ్చి, "రాజా, నన్ను రమ్మన్నావట. ఏమిటి విశేషం?" అని అడిగాడు.

"మీలాటి వాళ్ళ కోసం నేను కష్టపడి పెద్ద చెరువు తవ్వించి, అన్ని సౌకర్యాలూ అమర్చితే, మీరు ఆ చాయలకే రావటం లేదుట. ఏమిటి కారణం?" అని రాజు అడిగాడు.

"అవును. నేను మరొక చోటికి వెళు తున్నాను. కారణమడిగావు గనక చెబు తాను. ఇప్పుడది పుణ్యజలం కాదు. నోరు లేని జంతువులు తమ స్వశక్తితో ఏర్పరచు కున్న జలాశయాన్ని నువు నీ సేవకుల శ్రమతో పెద్ద చెరువుగా తయారు చేశావు, బాగానే ఉన్నది. కాని ఆ జలాశయం మీద బతుకుతూ వచ్చిన నోరులేని జంతువులకు అందులో ఒక్క చుక్క దక్కకుండా చుట్టూ ప్రహరీ కట్టి, ఆ జలానికి కాపు పెట్టావు. ఆ చెరువును నీ కీర్తి చిహ్నంగా చేసుకుని దానికి దివాకరసరోవరం అని పేరు పెట్టావు. అందుచేత పుణ్యజలం కాస్తా కలుషితమైపోయింది," అన్నాడు సన్యాసి.

రాజుకు తన తప్పు తెలిసివచ్చింది. ఆయన చెరువు చుట్టూ కట్టించిన ప్రహరీ గోడను పడగొట్టించేసి, అక్కడ కాపలా ఉండే భటులను తొలగించాడు. "దివాకర సరోవరం" అని రాసి ఉంచిన రాతిపలకను కూడా తీసేయించాడు. కొంతకాలం గడి చింది. ఆ చెరువులో నీరు అమృతంలాగా ఉన్నదని చెప్పుకోసాగారు ప్రజలు.





# పాతాళదుర్గం

## 18

[ కాలశంబర మాంత్రికుడు రాత్రివేళ కొండ మీది సరోవరంలో దిగి, జలస్తంభనం చేసి, బంగారపు రంగులో వున్న ఒక మొసలి పిల్లతో నీటి మీదికి తేలాడు. ఆ సమయంలో రాక్షసులు కాలుస్తున్న తారాజువ్వలు పాతాళదుర్గం వైపు నుంచి పైకెగర సాగినై. మాంత్రికుడు అనుచరులతో తన రహస్యనివాసం కేసి బయలుదేరాడు. తరవాత—]

మహాకలి రాక్షసుడు నివసించే పాతాళ దుర్గం దాదాపు ఒక అరకోసు విస్తీర్ణం వుంటుంది. దుర్గంచుట్టూ వలయాకారంలో, ఆకాశాన్నంటుతున్నట్టుండే కొండలు నిటారుగా వుండటంవల్ల, ఆ అరణ్య ప్రాంతాల నివసించేవా రెవరికీ అక్కడ దుర్గం వున్నదన్న సంగతే తెలియదు. దుర్గం నుంచి అరణ్యంలోకి వెళ్ళేందుకు రాక్షసులు కొండలో ఒక చోట సన్నని మార్గం తొలిచారు. దాన్ని వాళ్ళూ, వాళ్ళ బానిసలూ అరణ్యంలోకి పోయేందుకు వుపయోగిస్తూంటారు. ఎప్పుడైనా బుద్ధిపుట్టి దుర్గం వదలదలిస్తే మహాకలి ఆ దారినే ఏనుగుల రథం మీద అరణ్య విహారానికి వెళ్ళి వస్తూంటాడు.

ఒక్క మిట్టమధ్యాహ్నం వేళ మాత్రమే పాతాళదుర్గం మీద సూర్యరశ్మి పడుతుంది. ఉదయ సంధ్యా కాలాల్లో కొండలూ,




అరణ్యం వెలుగులో మునిగి తేలుతూంటే, పాతాళదుర్గం చిమ్మచీకటిలో మునిగి వుంటుంది. ఆ సమయాల్లో రాక్షసులు పెద్దపెద్ద అడవి మానులతో నెగళ్ళువేసి, ఆ కాంతిలో పనులు చేసుకుంటూంటారు.

రాక్షస సంహారానికి కాలశంబర మాంత్రికుడు ఎంతో కాలంగా ప్రయత్నాలు చేస్తున్నాడు. ఆ ప్రయత్నా లిప్పటికి ఫలించే సూచనలు కనిపించి, అతడు ఎంతో ఆనంద పడుతున్నాడు. ఇప్పుడు పాతాళదుర్గంలోని రాక్షసుల్లో కుంభీరుడి అనుచరులు కొంత మంది అతడి పక్షం అయారు. మహాకలి చెరలో పెట్టిన కుంతలదేశ మంత్రి కొడుకైన

శశికాంతుణ్ణీ, అతడు బలవంతంగా వివాహం ఆడచూస్తున్న రాకుమారి కాంతిసేననూ సమయం వచ్చినప్పుడు రక్షించి మాంత్రికుడి కొండగర్భంలోని రహస్యనివాసానికి చేర్చేందుకు కుంభీరుడు అంగీకరించాడు. మహాకలినీ అతడి బంధువర్గాన్నీ అంతం చేసిం తరవాత, పాతాళదుర్గాన్ని కుంభీరుడి కివ్వటానికి కాలశంబరుడు ఒప్పుకున్నాడు.

మాంత్రికుడు సరోవరం నుంచి బంగారు మొసలిపిల్లతో తన నివాసానికి తిరిగి వచ్చేప్పుడు, ధూమక సోమకులతో అనేక సంగతులు చెప్పాడు గాని, మహాకలిని ఏ పథకం వేసి తాను చంపబోతున్నదీ మాత్రం చెప్పలేదు. "మరికొద్ది ఘడియల పాటు అదంతా రహస్యంగా వుండవల సిందే," అన్నాడతడు.

కాని, ఆ రహస్యం ఏమిటో ధూమక సోమకులకూ, విరూపుడికీ కొంత తెలిసి పోయింది. వాళ్ళు మాంత్రికుడితో కలిసి వస్తూండగా, పెద్దపెద్ద బుట్టలు తలల మీద పెట్టుకుని కొందరు వాళ్ళకు ఎదురయ్యారు. ఒకటి రెండు చోట్ల ఆ బుట్టలను తాళ్ళతో మహావృక్షాల కొమ్మల్లోకి ఎక్కిస్తున్నవాళ్ళు, వాళ్ళ కంటబడ్డారు. గుహల్లోకి పోయే మెట్లను సమీపించే సరికి వారికి భద్రుడు

ఎదురై, కాలశంబర మాంత్రికుడితో, "దాదాపు ఏర్పాట్లన్నీ పూర్తయినై. ఓషధులూ, భస్మాలూ—అన్నీ చెల్లెక్కించాం. సూర్యోదయంవేళ గాలి అనుకూలం కాగానే వాటిని కొద్దికొద్ది మోతాదుల్లో, పాతాళదుర్గం లోని రాక్షసుల మీద ప్రయోగించటం జరుగుతుంది," అని చెప్పాడు.

"బావుంది. రాక్షసు లసలే మద్యపాన ప్రియులు. ఆ కైపుకు మన ఓషధులమత్తు తోడయిందంటే, వాళ్ళిక ప్రపంచమే మరిచి పోతారు. ఆ తరవాత నీళ్ళూ, రాళ్ళూ, బాణాలూ, అడవిమృగాలూ వాళ్ళను యమ పురికి ప్రయాణంకట్టిస్తవి! మహాకలి చెరలో వున్న మనవాళ్ళతో కుంభీరుడు సూర్యోదయంతోనే బయలుదేరి సరోవరం చేరాలి. ఆ సంగతి వాడు మర్చిపోయాడో, రాక్షసాధములతోపాటు వాడూ, మన మిత్రులూ కూడా నా మంత్రశక్తికి బలైపోతారు," అన్నాడు కాలశంబరుడు.

భద్రుడు తలవంచుకుని కొంచెం సేపు ఏదో ఆలోచించి, "మహామాంత్రికా! అందుకు నేనొక చిన్న జాగ్రత్త తీసుకుంటాను. శశికాంతుణ్ణీ, కాంతిసేననీ యిప్పుడే సరోవరప్రాంతం చేర్చమని కుంభీరుడికి కబురంపుతాను," అన్నాడు.



ఆ మాటకు మాంత్రికుడు కళ్ళెంతచేసి, "నీ స్నేహితుల రక్షణ ప్రయత్నంలో నీవు నా పథకం అంతా పాడుచేసేస్తున్నావు. నీవు, ఆ రాక్షసుడి దగ్గిరకు పంపే మనిషిని మహాకలి సేవకులు చూస్తే ఎంత ప్రమాదమో వూహించావా? వాణ్ణి వాళ్ళు దొరక పుచ్చుకుంటే, క్షణాల మీద మన రహస్యాలన్నీ వాడి చేత చెప్పించగలరు. అందుకే ముఖ్య విషయాలు పరమ రహస్యంగా దాచివుంచాను. నీవు మాత్రం కుంభీరుడి దగ్గిరకు ఎవర్నీ పంపకు," అన్నాడు.

భద్రుడు అంగీకార సూచకంగా తలాడించి వెళ్ళిపోయాడు. మాంత్రికుడు,






మాంత్రికుడు గరుడపక్షిని అందుకుని కిందపెట్టి, దాని ముందుకు తన దగ్గిరున్న బంగారు మొసలిపిల్లను తోశాడు. గరుడ పక్షి మొదట్లో దాన్ని ముక్కుతో పొడవ బోయింది. కాని, విరూపుడు వారించే సరికి తల అటూ యిటూ తిప్పి దాని కేసి చూస్తూ, చిన్నగా కీ పెట్టసాగింది.

"భేష్, సెభాష్!" అంటూ కాలశంబరుడు గరుడపక్షి కాలిన వేలాడుతున్న తాడును చేతికి తీసుకుని మొసలిపిల్ల నడుముకు బిగించాడు. తరవాత ఆ రెంటికీ కడుపునిండా మేతపెట్టమని విరూపుణ్ణి ఆజ్ఞాపించాడు.

విరూపుడి కేసి తిరిగి, "నీ నల్లగరుడుడు మనుషులకు బాగా మాలిమి అయిందేనా? బంగారు మొసలితో దానికి పొత్తుకలపాలి. రాక్షసుల మూఢవిశ్వాసాలను మనం వీలైనంతవరకూ వుపయోగించుకుని, వాళ్ళను ఆదమరిపించి సర్వనాశనం చేయాలి," అని చెప్పాడు.

విరూపుడు, గరుడపక్షిని మాంత్రికుడి చేతికిస్తూ, "ఇదేదో దేవతా పక్షి! మనుషుల్ని మించిన జ్ఞానం దీనికున్నది. శిథిల దేవాలయం దగ్గిర యిది నరవానరాన్ని ఒక్క దెబ్బతో కింద పడకొట్టిందంటే నమ్మ, దొరా," అన్నాడు.

కింద పాతాళదుర్గం వైపునుంచి క్రమంగా రణగొణ ధ్వని ఎక్కువ కాసాగింది. రాక్షసులు పెద్దపెద్ద మంటలు వేసి వాటి చుట్టూ గెంతుతూ పాటలు పాడసాగారు. కొందరు తాగిన మైకంలో భగభగ మండే మంటల్లో నుంచి కేకలుపెడుతూ అటూ యిటూ పరిగెత్తసాగారు. కాలశంబరుడు వాళ్ళ కేసి కొద్దిసేపు చూసి తృప్తిగా నవ్వుతూ, "ఇది, ఆ దుర్మార్గుల ఆఖరి వేడుక. మనవాళ్ళు మంత్రించిన ఓషధీ భస్మాలను గాలి వాటున వాళ్ళ మీదికి వదులుతున్నారు. చూశారా? దుర్గం మీద గాలిలో తెల్లగా





కనిపించేదంతా, అదే! వాళ్ళు దాని ప్రభావం వల్ల క్రమంగా మతులు పోగొట్టుకుంటారు. మహాకలి యింకా అక్కడికొచ్చినట్టులేదు. ఒకవేళ వాడు మంత్రౌషధీ ప్రభావం నుంచి తప్పుకున్నా, అనుచర సహాయంలేని వాణ్ణి, నా మంత్రదండం ప్రయోగించి క్షణాల మీద నాశనం చేయగలను," అన్నాడు.

మాంత్రికు డీ విధంగా తన అనుచరులతో సంభాషిస్తూ, పాతాళదుర్గంలో రాక్షసులు చేస్తున్న కోలాహలం చూస్తూ కొంత సేపు గడిపాడు. అంతలో తూర్పు తెల్లనై క్రమంగా సూర్యదర్శన మైంది. కాలశంబర మాంత్రికుడు నిలబడివున్న కొండప్రాంత మంతా వెలుగులో మునిగిపోయింది. అతడు కింద వున్న రాక్షసులకు తాను కనబడకుండా వుండేందుకు అనుచరులతో చెట్లగుబురుల్లోకి పోయి, తన నౌకర్లు దుర్గం మీద గుప్పిళ్ళతో గాలివాలున విసురుతున్న అమోఘ మూలికాభస్మాల కేసి తృప్తిగా చూస్తూ, "ఆ రాక్షసులు కేవలం తెచ్చి పెట్టుకున్న శివంతో ఆ నృత్యాలూ, మంటల్లో దూకటం చేస్తున్నా రనుకోకండి. నేను మంత్రించిన భస్మాలు వాళ్ళ మీద పడి, వాళ్ళను ఉన్మత్తుల్ని చేస్తున్నవి.




ఇంక కొద్ది సేపట్లో వాళ్ళు పూర్తిగా పిచ్చి వాళ్ళయిపోతారు," అన్నాడు.

కాలశంబరుడి మాటలు కేవలం ప్రగల్భాలు కాదు. అప్పటివరకూ పాడుతూ గెంతుతున్న రాక్షసుల్లో కొందరు, ఒకళ్ళనొకళ్ళు కవ్వించుకుని శూలాలతో, గదలతో కొట్టుకో సాగారు. అందులో రెండు పక్షాలుగా విడిపోయి తన్నుకోటం అంటూ ఏమీ లేదు. అందినవాణ్ణి అందినవాడు ఎడాపెడా బాదేస్తున్నాడు.

పాతాళదుర్గం ముందున్న మైదాన ప్రదేశ మంతా చిన్న యుద్ధరంగంగా మారిపోయింది. మాంత్రికుడు పరమానందం





చెంది శాంభవీ! అంటూ మంత్రదండాన్ని కళ్ళకద్దుకో బోయేంతలో, ఏనుగుల రథం మీద మహాకలి శరవేగంతో కొట్లాడుకొంటున్న రాక్షసుల మధ్యకు వచ్చాడు. అతడి వెంట పెద్దపెద్ద గదలు ధరించిన ఇరవై ముఫైమంది అతి బలశాలులైన రాక్షసులున్నారు. వాళ్ళు మామూలు రాక్షసుల కన్న మరి కొంచెం ఒడ్డూ పొడుగూ వున్నారు. వాళ్ళు మహాకలి రాక్షసుడి అంగరక్షక దళంలోని వాళ్ళు.

మహాకలి కొండగుహలు దద్దరిల్లేలా కేకలు పెడుతూ, తన చేతిలోని పొడవాటి ఖడ్గమృగ చర్మపు కొరడాతో పోట్లాడుకుంటున్న రాక్షసులను కసిగా కొట్ట సాగాడు. అతడి అంగరక్షకులు వాళ్ళను విడదీసి దూరంగా నిలబెడుతూ, ఎదురు తిరిగిన వాళ్ళను గదలతో పొడవసాగారు.

"దెబ్బకు దెయ్యం దడుస్తుందంటారే..., అదే ఇప్పుడు జరుగుతున్నది. మన మంత్రౌషధాల శక్తి వృథా అయే ప్రమాదం రావచ్చు," అంటూ కాలశరీబర మాంత్రికుడు పక్కకు తిరిగి, "భద్రుడెక్కడ? కుంభీరుడు మనం రక్షించవలసిన శశికాంతుణ్ణీ, కాంతిసేననూ కారాగారం నుంచి తప్పించి సురక్షితంగా సరోవర ప్రాంతం చేరటానికి ఇదే మంచి అదను," అన్నాడు.

మాంత్రికుడి మాటల ధోరణీ, వాలకం లోగడ వున్నంత ధీమాగా లేవు. తన పథకం ఎక్కడో దెబ్బ తినబోతున్నదన్న భయం పట్టుకున్నవాడిలా అతడు ప్రవర్తిస్తున్నాడని ధూమకుడు అనుమానించాడు. పాతాళ దుర్గ ప్రాంతంలో మహాకలీ, అతడి అంగరక్షకులూ కలిసి రాక్షసుల్ని చిన్నచిన్న ముఠాలుగా విడదీసి వాళ్ళ కేదో చెపుతున్నారు. బహుశా మహాకలి తనకు మాంత్రికుణ్ణుంచి ప్రమాదం రానున్న సంగతి కుంభీరుడి అనుచరులైన రాక్షసుల్లో ఏ ద్రోహి ద్వారా నైనా తెలుసుకున్నాడా?

ధూమకు డిలా ఆలోచిస్తున్నంతలో భద్రుడు ఇద్దరు అనుచరుల్ని వెంటబెట్టుకుని అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "మహామాంత్రికా! దుర్గంలో రేగిన అల్లకల్లోలం అవకాశంగా తీసుకుని, కుంభీరుడు మన వాళ్ళతో సరోవర ప్రాంతానికి బయలుదేరాడు. ఆఖరి క్షణంలో భామాసింగి రహస్యం గ్రహించి ఏదైనా చేయబోయి వుంటుంది—దాని నోరు కట్టి భుజాన వేసుకుని వస్తున్నాడు. చెట్ల మీద వున్న మన వాళ్ళు చూసి చెపుతున్నారు," అన్నాడు.

"జై శాంభవీ! విజయం మనదే! పదీ పన్నెండు నిమిషాల కాలం రాక్షసుల దృష్టిని మరొక వైపుకు మరల్చగలిగామా, వాళ్ళు చచ్చినవాళ్ళ కింద జమే. విరూపా! నీ నల్ల గరుడుణ్ణి రాక్షసుల మీదికి వదులు. ఏం జరుగుతుందో చూద్దాం. దాని కాలికి బంగారు మొసలిపిల్లను కట్టాంగదా?" అన్నాడు మాంత్రికుడు.

విరూపుడు నల్లగరుడపక్షి తల నేకమారు నిమిరి దాన్ని రెండు చేతులతో పైకెత్తి రాక్షసు లున్న మైదానం కేసి వదిలాడు. అది కీ అని అరుస్తూ వాళ్ళ మీద ఎగర సాగింది. దాని కాలికి కట్టివున్న బంగారు మొసలిపిల్ల గిలగిలా కొట్టుకుంటూ సూర్య కాంతిలో మిలమిల మెరుస్తున్నది. పక్షిని చూసిన రాక్షసులు చేతులు పైకెత్తి దణ్ణాలు పెడుతూ, 'మహాకలి ప్రభువువారి తండ్రి ఘోరకలి స్వయంగా తమ శతవర్ధంతికి వచ్చారు!" అంటూ కేకలు పెట్టి, నేల మీద ప్రాణాచారాలు పడసాగారు.

కాలశంబరుడు బ్రహ్మానందపడి "సరోవరం దగ్గిర చెట్టు బోదెకు కట్టివున్న మోకుల్ని నీటిలో నుంచి బయిటికి లాగండి, వాటి వెంట ఒక బండరాయి వస్తుంది. మన వాళ్ళందర్నీ గుహల్లో నుంచి కొండ మీదికి రమ్మనండి," అని తన అనుచరుల్ని ఆజ్ఞాపించాడు. —(ఇంకావుంది)






# సహనశీల

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ సహనశక్తి అత్యాశ్చర్య కరమైనది. నిన్ను చూస్తుంటే శివకాముడు పెళ్ళాడిన కేతకి అనే స్త్రీ జ్ఞాపకం వస్తున్నది. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు వాళ్ళ కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒక కొండ ప్రాంతంలోని ఒక గ్రామంలో శివకాము డనే కాపుయువకు డుండేవాడు. అతని పొలం కొండనానుకునే ఉండేది. అక్కడే అతని పశువుల దొడ్డి కూడా ఉండేది. పైరు కోతకు వచ్చినది మొదలు పంట ఇంటికి చేరినదాకా అతను ఆ పశువుల దొడ్డిలోనే అహోరాత్రాలు గడిపేవాడు. ఎందుచేతనంటే ఆ ప్రాంతాల దొంగల

## బేతాళ కథలు



భయమూ, దుండగీళ్ళ భయమూ ఉండేది. ఒక చీకటి రాత్రి శివకాముడు మంచం మీద నడుము వాల్చబోతూండగా కొండ పక్క నుంచి ఏదో అలికిడి వినిపించింది. అతను చప్పున పశువుల చావిడి నుంచి బయటికి వచ్చి చూస్తే, కొండ మీదికి ఎవరో వేగంగా ఎక్కి పోతున్నట్టు కారుచీకట్లో అస్పష్టంగా కనిపించింది. శివకాముడు దుడ్డుకర్ర ఒకటి తీసుకుని పరుగున కొండ దారి వెంబడి వెళ్ళాడు.

కాని ఆ దారి చిన్న మలుపు తిరిగేసరికి అతని ఎట్టఎదట ఒక ఇల్లు కనబడింది. ఇంటి లోపల దీపాలు వెలుగుతున్నాయి.



ఆ ఇంటిని చూసి శివకాముడు దిగ్భ్రాంతుడయాడు. ఎందుచేతనంటే అతనికి తెలిసినంతవరకు ఆ ప్రాంతాల ఇల్లు అన్నది లేదు. తన పశువుల దొడ్డికి ఇంత సమీపంలో ఇల్లెప్పుడొచ్చిందో, అందులో ఎవరుంటున్నారో అతనికి అంతుచిక్కలేదు.

ఈ వింత ఏమిటో తేల్చుకుందామని అతను ఇంటిని సమీపించి, లోపలికి అడుగు పెట్టాడు. అది కొత్తగా కట్టిన ఇల్లులాగా లేదు. చూడటానికి మోతుబరి ఇల్లులాగా ఉంది. లోపల కలపసామగ్రీ, వెండి వస్తువులూ కనిపించాయి. ఇంట్లో ఒక వయసుమళ్ళిన పురుషుడూ, స్త్రీ ఉన్నారు. ఒక వయసులో ఉన్న పిల్ల లోపలి గదిలో అటూ ఇటూ తిరుగుతూ మధ్య మధ్య శివకాముడి కేసి చూస్తున్నది.

ఆ పిల్ల ముందు చావిట్లోకి వచ్చి, "వడ్డించాను, భోజనానికి లేవండి," అని పెద్దవాళ్ళతో అన్నది.

ముసలివాడు శివకాముడితో, "నువు కూడా భోజనానికి రా, నాయనా!" అన్నాడు.

అసలే శివకాముడికి తాను చూస్తున్నదంతా మాయ అనిపిస్తున్నది. వాళ్ళు తనను భోజనం చెయ్యమనటంలో ఏదో దుర్మార్గం కూడా ఉండవచ్చునని అతనికి తోచింది.







అతని సంకోచం చూసి ముసలివాడు, "భయపడకు, ఎలా వచ్చావో, అలాగే వెళ్ళిపోదూ గాని," అన్నాడు.

కాని శివకాముడు భయంతో ఏమీ అనక, బెల్లం కొట్టిన రాయిలాగా ఉండిపోయాడు. అతని కళ్ళు ఆ అమ్మాయి మీదనే ఉన్నాయి. అంత అందమైన మనిషిని అతను కలలో కూడా ఊహించలేదు. ఆమె పదే పదే తన కేసి దృష్టి మరల్చుతూ ఉండటం అతను గమనించాడు.

అంతలోనే అతనికి తల తిరిగినట్టయింది. అతను కళ్ళు గట్టిగా మూసుకుని మళ్ళీ తెరిచి చూసేసరికి దృశ్యం పూర్తిగా మారిపోయింది. అతను తన పశువుల దొడ్లోనే ఉన్నాడు. ఎదురుగా కొండ ఉన్నది. అంతటా చీకటి. ఇల్లూ లేదు, ఏమీ లేదు. తల పైకెత్తి చూస్తే నడినెత్తిన ఉండవలిసిన నక్షత్రాలు బాగా పడమటికి వాలిపోయాయి. అంటే అతను పశువులపాక నుంచి బయటికి వచ్చి ఝామున్నర అయి ఉండాలన్న మాట!

ఈ వింత సంఘటన గురించే ఆలోచిస్తూ అతను మంచం మీద పడుకుని, గాఢమైన నిద్రపోయాడు. కాని మర్నాటి నుంచీ అతను పూర్తిగా మారిపోయాడు. క్రితం రాత్రి తాను చూసిన ఆ అమ్మాయి రూపం అతని కళ్ళలో అలాగే మెదులుతున్నది. ఏ పని చేస్తున్నా అతనికి ఆమెను మరవటం మటుకు సాధ్యం కాలేదు. అతను వెర్రివాడి లాగా కొండప్రాంత మంతటా తిరిగాడు. ఆ ఇల్లు గాని, ఆ పిల్ల గాని, ఆమె తల్లి దండ్రులు గాని అతనికి ఎక్కడా కనిపించ లేదు. మనిషికి పరధ్యానం జాస్తి అయింది, పాలిపోయాడు, చిక్కి సగమయాడు.

ఏడాది తిరిగింది. మళ్ళీ కోతల తరుణం వచ్చింది. శివకాముడు మళ్ళీ పశువుల దొడ్లో రాత్రింబగళ్ళు గడప నారంభించాడు. ఒక రాత్రి అతను ఎందుకో పశువుల పాక బయటికి అడుగు పెడుతూనే ఆ పాత ఇంటి





చావట్లో ఉన్నాడు. ఆ ముసలివాడూ, ఆయన భార్యా, కుమార్తే—అంతా వెనకటి లాగే ఉన్నది. ఆ పిల్లను చూడగానే శివ కాముడికి ప్రాణాలు లేచి వచ్చినట్టయింది. ఆ మనిషిని చూస్తుంటే కడుపు నిండినట్టుగా ఉన్నది. ఆమె కొంచెం సేపు లోపలి గదిలో తారట్లాడి, అందరినీ భోజనాలకు రమ్మన్నది. ఈ సారి శివకాముడు సంకోచించలేదు. ముసలివాడు రమ్మనటమే ఆలస్యంగా అతను కూడా లోపలికి వెళ్ళాడు.

భోజనం దివ్యంగా ఉన్నది. అంత రుచి కరమైన అధరువులు శివకాము డెన్నడూ తిని ఉండలేదు. భోజనాల దగ్గిర పెద్ద వాళ్ళిద్దరూ తమ కూతురి పెళ్లి ప్రస్తావన తెచ్చి, ఆమెను శివకాముడి కిచ్చి చెయ్యా లన్న తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. ఆమెను పెళ్ళాడినట్టయితే అతనికి బాగా కలిసి వస్తుందనీ, పది తరాలపాటు అతని వంశం సుభిక్షంగా ఉంటుందనీ అన్నారు.

శివకాముడు మారు మాటాడకుండా ఆ పిల్లను పెళ్ళాడటానికి సమ్మతించాడు. ఆమె పేరు కేతకి.

ఈ యేడు అతను పంటతో పాటు ఇంటికి చేరుకోలేదు. అతను పశువుల దొడ్డిలోనూ లేడు. ఏమయాడో అతని బంధువులకు అంతు చిక్కలేదు. చివరకు ఒకనాడు అతను ఇల్లు చేరేసరికి, అతని వెంట అప్సరసలాటి అమ్మాయి ఒకతె ఉన్నది.

"ఈమె నాకు కాబోయే భార్య," అన్నాడు శివకాముడు. ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. వాళ్ళ వివాహం యథాప్రకారం జరిగింది. పెళ్లికూతురు చాలా సాధువు. ఆమెలో ఏ మాత్రమూ అతిశయ మన్నది లేదు. ఆమె ఎవరో, ఎక్కణ్ణుంచి వచ్చిందో తెలియకపోయినా అందరూ సంతోషించారు.

ఆమె అడుగు పెట్టినది మొదలు శివ కాముడి ఇంట పాడి పంటలు అభివృద్ధి అయాయి. ఆమె తన ఇంటికి వచ్చిన

వారిని, ఎంత పేదవారైనా సరే, ఆదరించ కుండా పంపేది కాదు. ఆమె దయాదాక్షిణ్యాలను గురించి చుట్టుపట్ల చాలా దూరం తెలియటం వల్ల, బీదా బిక్కీ ఎప్పుడూ వాళ్లింటికి వచ్చి ఆమె సహాయం పొందుతూండేవారు.

కేతకిని పెళ్ళాడాక శివకాముడు త్వరలోనే మామూలు మనిషి అయాడు. సిరి సంపదలు కలిసి రావటంతో అతనికి కాస్త అహంకారం కూడా పెరిగింది. రాను రాను అతను తన భార్యను చాలా తేలిక చేసి చూడసాగాడు. అస్తమానమూ భార్యను చూసి విసుక్కునేవాడు. నోటికి వచ్చినట్టు తిట్టి అవమానించ నారంభించాడు. కేతకి ఎంతో ఓర్పుతో అన్నీ భరించి ఊరుకునేది తప్ప, ఎదురు చెప్పేది కాదు.

ఇలా కొంతకాలం జరిగాక ఒక సంక్రాంతి ముందర ఒక ఎద్దు చాలా పొగరుబోతుతనం చూపి, అతన్ని పలుపుతో సహా ఈడ్చుకు పోసాగింది. కేతకి చప్పున ఇంట్లోనుంచి బయటికి వచ్చి, తన భర్త చేతిలో ఉన్న పలుపు తీసుకుని ఒక్క గుంజు గుంజింది. వెంటనే ఎద్దు, గుండెల్లో ఎవరో పొడిచినట్టుగా పడిపోయి, తిరిగి లేచి నిలబడటానికి చాలా ప్రయాసపడింది. లేచి




నిలబడ్డాక కూడా ఆ ఎద్దు వణుకుతూ ఉండటం శివకాముడు కళ్ళారా చూశాడు.

తరవాత కేతకి ఆ ఎద్దును పిల్లిని పట్టుకుపోయినంత తేలికగా గుంజ దగ్గిరికి పట్టుకుపోయి కట్టేసింది. ఎద్దు ఆమె కేసి బెదురు చూపులు చూస్తున్నది. ఇది చూస్తున్న శివకాముడికి కూడా గుండెలో దడపుట్టింది. తన భార్య మామూలు మానవ స్త్రీ కాదన్న సంగతి మరిచిపోయి అతను ఆమెను చాలా చులకనగా చూశాడు, అవమానించాడు.

శివకాముడు తన బుద్ధి తక్కువ గ్రహించి, అది మొదలు భార్య పట్ల ఎంతో గౌరవాభిమానాలతో మసులుకున్నాడు. వాళ్లు

గంపెడు పిల్లల్ని కని, పాడిపంటలతో కలకాలం చాలా సుఖంగా జీవించారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, శివకాముడు తన భార్యను మామూలు మనిషిగా చూసి అవమానించటంలో తన నైజం బయట పెట్టుకున్నాడు కాని కేతకి అమానుష శక్తిసామర్థ్యాలుండి కూడా ఆ అవమానాలను ఎందుకు సహించింది? ఆమె మామూలు భార్యల లాగే సహనం ప్రదర్శించటానికి ఏమిటి కారణం? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కేతకి ప్రవర్తనకు అనేక కారణాలున్నాయి. ఒకటి, ఆమె దేవతా స్త్రీ అయినప్పటికీ ఒక మానవుణ్ణి వలచి పెళ్ళాడింది; అతని కోసం మానవత్వం అవలంబించింది. అటువంటప్పుడు మానవ స్త్రీల విధులు నిర్వర్తించటం భావ్యంగా ఉంటుంది, కాని తాను అమానవ స్త్రీ నన్నది భర్తకి చీటికీ మాటికీ జ్ఞాపకం చెయ్యటం భావ్యంగా ఉండదు. రెండో సంగతి, ఆమె మానవ స్త్రీ కాదు గనక, మానవ స్త్రీలకు దుర్భర మనిపించే పరిస్థితులు ఆమెను కదల్చలేక పోవచ్చు. బలహీనుడి కన్న బలవంతు డెప్పుడూ ఎక్కువ నిగ్రహం కలిగి ఉంటాడు. మూడో సంగతి, కేతకి ఎద్దు మీద చూపిన బలంలో పదోవంతు భర్త మీద చూపి ఉంటే అతను బతికున్నంత కాలమూ అవిటివాడై ఉండేవాడు. అందువల్ల కేతకి కాపరం సుఖమయం కాబోదు. అందుచేతనే తన శక్తిని భర్త గుర్తించే అవకాశం దొరికినదాకా కేతకి ఎంతో ఓర్పు వహించి, నేర్చుకోదగిన గుణపాఠం అతన్నే నేర్చుకోనిచ్చింది," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పిశాచికి పురుడు

చౌలాకాలం క్రితం ఒక దూర దేశంలో ఒక కుగ్రామంలో ఒక పేదరాలుండేది. ఆమె బుట్టలల్లి, వాటి మీద వచ్చిన ఆదాయంతో అతి బీదగా బతికేది.

ఒకనా డామె నీళ్ళు తేవటానికి బిందె తీసుకుని పోతూండగా పొదల మధ్యగా ఉన్న దారికి అడ్డంగా ఒక పెద్ద గోదురు కప్ప కనిపించింది. ఆమె వేళాకోళానికి ఆ కప్పతో, "నువ్వీసారి కనేటప్పుడు వచ్చి పురుడు పోస్తాను గాని దారికి అడ్డం తొలుగు, తల్లీ!" అన్నది.

ఆమె అలా అనగానే గోదురుకప్ప పొదల్లోకి వెళ్ళిపోయి దారి ఇచ్చింది.

కొంతకాలం గడిచింది. ఒకనాడు ఆ పేదరాలు సాయంకాలం పూట రాట్నం పైకి తీసి నూలు వడుక్కుంటూండగా ఒక మనిషి ఆమె ఇంట్లోకి తిన్నగా వచ్చేసి, "ఇదుగో, నా భార్యకు త్వరలోనే ప్రసవం రాబోతున్నది. నువు మంత్రసాని తనం చేస్తానని మాట ఇచ్చావు గనక, వచ్చి కాన్పు చేయించు. నీ కష్టం ఉంచుకోంలే!" అన్నాడు.

పేదరాలు నిర్ఘాంతపోయి, "నే నేమిటి? మంత్రసానితనం చెయ్యటమేమిటి? నేను అలాటి పని ఏ నాడూ చెయ్యలేదు. నాకు చాతకాను కూడా కాదు," అన్నది.

"అలాటి దానివి మాట ఎందుకిచ్చావు? చేస్తానన్నాక చెయ్యక ఎలా తప్పుతుంది?" అన్నా డా మనిషి.

"నే నలా ఎవరికీ మాట ఇయ్యలేదు," అన్నదామె.

"ఒకనాడు ఒక గోదురుకప్పకు మాట ఇచ్చావు, జ్ఞాపకం తెచ్చుకో. ఆ గోదురు కప్ప నా భార్య. నేను కామినీపిశాచాల రాజును. పురుడు పోసినందుకు తగిన ప్రతిఫలం ఇస్తాను," అన్నా డా మనిషి.

పి. రామానందం

పేదరాలు కంగారుపడి పోయింది. ఆమె ఆ మనిషితో, "నీ భార్యకు నొప్పు లారంభమైతే కబురు చెయ్యి, నేను వచ్చి, నాకు చాతనయిన సహాయం చేస్తాను," అన్నది.

ఆ మనిషి వెళ్లిపోయాడు. రెండు మూడు రోజుల అవతల అర్ధరాత్రి వేళ అతనే వచ్చి, "నా భార్యకు నొప్పులు వస్తున్నాయి. నా వెంట రా!" అని ఆమెను పిలిచాడు.

ఇద్దరూ కలిసి బయలుదేరారు. కొంత సేపు నడిచాక ఇద్దరూ ఒక దివ్యమైన భవనంలో ప్రవేశించారు.

ఇంట్లో ప్రవేశిస్తూనే ఆ మనిషి ఒక చోట రెడ్డిగం వేసుకు కూర్చున్నాడు. భర్త అలా కాళ్ళు మెలికవేసి కూర్చుంటే భార్యకు ప్రసవంరాదు. అందుచేత పేదరాలు అతనికి ఏవేవో పనులు కల్పించ యత్నించింది. కాని ఆ మనిషి రాయిలాగా కదిలాడు కాడు. అవతల అతని భార్యకు పెద్దపెద్ద నొప్పులు వస్తున్నాయి కాని, ఆమె కనలేకుండా ఉన్నది. పేదరాలు ఒక యుక్తి ఆలోచించింది. ఆమె చప్పున అతని వద్దకు వచ్చి, "నీ భార్య ప్రసవించింది!" అన్నది.

భర్త అమితాశ్చర్యంతో, "ఎలా కన్నదీ?" అంటూ లేచాడు. వెంటనే అతని భార్య ప్రసవించింది. పేదరాలు బిడ్డకు బొడ్డుకోసి, స్నానం చేయించి, "నేను వచ్చినపని అయిపోయింది. వెళ్ళివస్తాను," అన్నది.

పిశాచాలరాజే ఆమెను ఇంటి దగ్గిర దిగబెట్టాడు. అప్పటికి తూర్పు తెల్లవారుతున్నది. అతను ఏదో ప్రతిఫలం ఇస్తానన్నాడు గాని పేదరాలు అడగలేదు.

పేదరాలు కాస్సేపు విశ్రాంతి తీసుకుని ఇంటి ముందు కసువు ఊడ్చటానికి బయటికి వచ్చేసరికి గడప మీద ఒక వెండి నాణెం ఉన్నది. అదిమొదలు ప్రతి ఉదయమూ గడప మీద ఒక వెండినాణెం ఉంటూ వచ్చింది. అప్పటి నుంచీ ఆ పేదరాలికి దారిద్ర్యబాధ తీరిపోయింది.






# మధ్యవర్తి

పూర్వం ఉజ్జయినీ నగరంలో గుంజయుడనే నిరుపేదవాడు అరణ్యంలో పచ్చిగడ్డి కోసుకొచ్చి, ధనికుల గుర్రాలకు మేత కింద అమ్మి అలా వచ్చిన డబ్బుతో జీవిస్తూ ఉండేవాడు. అతని ఇల్లు ఊరి చివర ఉండేది. తాను రోజూ గడ్డి అమ్మగా రెండున్నర అణాలు వచ్చేది. అందులో రెండణాలు తన తిండి వగైరాల కింద ఖర్చుచేసి, మిగిలిన అర్ధణా కాసును ఒక బానలో వేస్తూ వచ్చాడు గుంజయుడు. అతనికి పెళ్లామూ, పిల్లలూ, బంధువులూ ఎవరూ లేరు. చెప్పకోదగిన కష్టం గాని, సుఖం గాని ఎరగకుండా గుంజయుడు కొన్ని పుష్కరాల పాటు ఇదే విధంగా జీవించి, ముసలివాడయిపోయాడు. అతని బాన కూడా అర్ధణా కాసులతో పూర్తిగా నిండిపోయింది.

ఒక రాత్రి గుంజయుడు బానలోని కాసులన్నీ నేల మీద పోసి, అది చాలా పెద్ద కుప్పగా ఉండటం చూసి, "ఇంత డబ్బు నేనేం చేసుకోను?" అనుకున్నాడు. చాలా ఏళ్ళుగా ఒక రకం జీవితానికి అలవాటు పడిపోవటం చేత అతనికి డబ్బుతో తీరగల కోరిక ఒక్కటీ కనిపించలేదు. ఆఖరుకు, తన మట్టిగోడల గుడిసె నుంచి పెంకుటింటికి మారాలన్న కోరిక కూడా అతనికి లేదు. ఆ డబ్బు ఏం చెయ్యాలో మర్నాడు ఆలోచించుదామనుకుని గుంజయుడా రాత్రి పడుకుని నిద్రపోయాడు.

అతనికి తెల్లవారుఝామున, లేవబోయే ముందు, కలలో ఒక చక్కని యువతి స్పష్టంగా కనిపించింది. గుంజయుడు నిద్ర లేచాక కూడా ఆమె ఆకారం అతని కళ్ళలో మెదులుతూనే ఉన్నది. తన డబ్బు ఏం చెయ్యాలో అతనికి తెలిసిపోయింది. అతను తన డబ్బంతా గోతంలో వేసుకుని, ఒక ప్రఖ్యాత నగల వర్తకుడి

ఎమ్. రామశర్మ




వద్దకు వెళ్ళాడు; తన అర్ధణాలన్నీ వర్తకుడి ముందు కుమ్మరించి, "అయ్యా, నేనిది నా జీవితమంతా కూడబెట్టిన సొమ్ము. ఇది తీసుకుని నాకు మంచి ఆభరణం ఏదైనా ఇవ్వండి," అని అడిగాడు.

వర్తకుడి గుమాస్తాలు అర్ధణాలన్నిటినీ ఎంచి కుప్పలుగా పేర్చి, మొత్తం ఎంతో తెలిపారు. వర్తకుడు కొన్ని హారాలూ, కంకణాలూ తెచ్చి గుంజయుడి ముందు పెట్టి, "నీ డబ్బుతో వీటిలో ఏదయినా కొనవచ్చు," అన్నాడు. వాటిలో, కెంపులూ, పచ్చలూ తాపిన కంకణం ఒకటి గుంజయుడికి నచ్చింది. అతను దాన్ని తీసుకుని, తన పై బట్ట చెంగున కట్టుకుని తిన్నగా ఒక వర్తకుడి ఇంటికి వెళ్ళాడు. ఈ వర్తకుడు గుంజయుడికి బాగా తెలిసినవాడు.

"అయ్యా, తమరు వర్తకం మీద దేశదేశాలు తిరుగుతూంటారు. చాలా చక్కని అమ్మాయి, పదిహేను పదహారేళ్ళ వయసు గలది ఉన్నట్టు మీ రెప్పుడైనా విన్నారా?" అని అడిగాడు.

"నువు సాగోర దేశపు రాజకుమార్తెను గురించి అడుగుతున్నట్టున్నావు. ఆమె అందం గురించి దేశదేశాలా చెప్పుకుంటారు. వయసు కూడా నువు చెప్పినంతే ఉంటుంది. అంతేకాదు, ఆమె చాలా మంచిదనీ, ఆమెలో ఏ కోశానా అతిశయమూ, అహంభావమూ లేవనీ అంటారు," అన్నాడు వర్తకుడు.

గుంజయుడికి పరమానందమయింది. అతను తన పైబట్ట చెంగు నుంచి కంకణం విప్పి, "తమరు ఈసారి సాగోరదేశం మీదుగా వెళ్ళేటప్పుడు ఈ కంకణాన్ని సాగోర రాజకుమార్తె కివ్వండి. దీన్ని ఎవరిచ్చారంటే మాత్రం చెప్పవద్దు," అన్నాడు.

"నేను పై వారంలోనే ఆ దిక్కుగా బిడారుతో బయలుదేరుతున్నాను. ఈ బహుమానానికి ప్రతిగా రాజకుమార్తెను ఏమి అడగమన్నావు?" అన్నాడు వర్తకుడు.

"ఏమీ అవసరం లేదు. ఈ కంకణం ఆమెకు చేరటమే నాకు కావలిసింది," అన్నాడు గుంజయుడు.

వర్తకుడు అనుకున్న ప్రకారం బిడారుతో బయలుదేరి దారిలో అనేక నగరాలలో క్రయ విక్రయాలు చేసుకుంటూ కొద్ది వారాలలో సాగోరపురం చేరి, రాజకుమార్తె దర్శనం చేసుకుని, "దీనిని ఒక వ్యక్తి తమకు కానుకగా సమర్పించమన్నాడు," అంటూ గుంజయుడిచ్చిన కంకణాన్ని తీసి ఆమెకు ఇచ్చాడు.

ఆమె ఆ కంకణాన్ని తన చేతికి తగిలించుకుని, "నా చేతికి సరిగా సరిపోయింది. చాలా అందంగా ఉన్నది. దీన్ని నాకిచ్చిన వ్యక్తి ఎవరు?" అన్నది.

"క్షమించాలి. ఆ వ్యక్తి పేరు బయట పెట్టడానికి నాకు అనుమతి లేదు," అన్నాడు వర్తకుడు.

రాజకుమార్తె ఆశ్చర్యపడి, "పోనీ, అతను నా నుంచి ఏమి ప్రత్యుపకారం కోరి ఈ కానుక పంపాడు?" అని అడిగింది.

"మీరీ కంకణాన్ని స్వీకరించటమే అతను కోరినది," అన్నాడు వర్తకుడు.

"అతను కోరనంత మాత్రాన నేను ఇవ్వక పోవటం భావ్యం కాదు," అని రాజకుమార్తె వర్తకుడి చేతికి మేలైన వస్త్రాలూ, ఒంటెడు





బరువు చీనాంబరాలూ, వర్తకుడికి కొంత డబ్బూ ఇచ్చింది.

కొద్ది మాసాల అనంతరం వర్తకుడు ఉజ్జయినికి తిరిగివచ్చి, "నీ కంకణం తీసుకుని సాగోర రాజకుమార్తె నీకు ఈ బట్టలూ, ఒంటెడు బరువు చీనాంబరాలూ పంపింది," అని గుంజయుడికి తెలిపాడు.

గుంజయుడు నిర్ఘాంతపోయి, "నే నీ చీనాంబరాలన్నీ ఏం చేసుకోను? వీటిని స్వీకరించటానికి అర్హుడైనవాడెవడైనా ఉన్నాడేమో తమకు తెలుసునా?" అన్నాడు.

"లేకేం? దక్షిణంగా విదర్భ దేశంలో ఒక రాజకుమారు డున్నాడు. అతను చాలా అందగాడనీ, జనప్రియుడనీ చెబుతారు," అన్నాడు వర్తకుడు.

"అలా అయితే తమరు వర్తకం మీద అటుగా వెళ్ళేటప్పుడు ఈ చీనాంబరాలను విదర్భ రాజకుమారుడికి చేర్చగలరా?" అని గుంజయు డడిగాడు.

కాలక్రమాన ఆ చీనాంబరాలను వర్తకుడు విదర్భ రాజకుమారుడికి అందజేసినప్పుడు ఆ యువకుడు కూడా, సాగోర రాజకుమార్తెలాగే, "వీటిని నాకు పంపిన దెవరు? ఏం కోరుతున్నారు?" అని అడిగాడు. కాని వర్తకుడు గుంజయుడి పేరు చెప్పలేదు; ఏ కోరికా లేదని మాత్రం చెప్పాడు. అయినప్పటికీ రాజకుమారుడు తన అశ్వశాల నుంచి పన్నెండు మేలుజాతి అశ్వాలను తెప్పించి వర్తకుడి కిచ్చి, "నాకు చీనాంబరాలు కానుకగా పంపినవారికి ఈ గుర్రాలను నా బహుమతిగా ఇవ్వండి," అని చెప్పాడు.

ఆ గుర్రాలను చూసి గుంజయుడు మళ్ళీ సమస్యలో పడ్డాడు. చివర కతను వర్తకుడితో, "వీటిలో రెండు తమరే ఉంచుకుని, మిగిలినవాటిని వీలుపడినప్పుడు సాగోర రాజకుమార్తెకు బహుమతిగా ఇచ్చెయ్యండి," అన్నాడు.

వర్తకుడా గుర్రాలను తెచ్చి తన కిచ్చి నప్పుడు రాజకుమార్తె, ఎరగని వ్యక్తి నుంచి ఇలా బహుమతులు తీసుకోవటానికి సంకోచించి, "ఆయన ఎవరో ఇలా బహుమతు లిస్తూపోతుంటే ఎలా తీసుకునేది? కనీసం ఆయన ఎవరో తెలిసినా బాగుం డును," అన్నది.

"ఆ పెద్దమనిషి తన శక్తికి మించినది ఏమీ ఇవ్వటంలేదని మటుకు చెప్పగలను. ఆ పైన నన్నేమీ అడగవద్దు," అన్నాడు వర్తకుడు.

రాజకుమార్తె తన తండ్రితో సంప్రతించి, ఆయన సలహా తీసుకున్నది.

"ఒక్కసారిగా మరీ గొప్ప బహుమానం పంపెయ్యి. ఆ తరవాత అంతకన్న తక్కువ బహుమానం పంపటానికి మొహం చెల్లక అతనే విరమించుకుంటాడు," అని రాజు సలహా ఇచ్చాడు.

రాజకుమార్తె ఆ ప్రకారమే ఇరవై ఒంటెల మీద, అవి మొయ్యగలిగినంత వెండి వేసి కానుకగా ఇచ్చింది. వర్తకుడు వాటిని తెచ్చి గుంజయుడి ముందుంచాడు. గుంజయుడు వాటిని చూసి కలవరపడి, "వీటిని నేనేం చేసుకునేది? వీటిలో ఆరు ఒంటెలనూ, వాటి మీది వెండినీ తమరే



ఉంచుకుని, అందుకు ప్రత్యుపకారంగా మిగిలిన పద్నాలుగు ఒంటెలనూ విదర్భ రాజకుమారుడి కిచ్చినట్టయితే నేను తమకు చాలా రుణపడి ఉంటాను," అన్నాడు.

వర్తకుడు తన సొంత పనులు కట్టిపెట్టి, ఒంటెలను తోలుకుని విదర్భకు వెళ్లి, రాజ కుమారుడికి వాటిని కానుక పెట్టాడు. సాగోర రాజకుమార్తెలాగే విదర్భ రాజకుమారుడు కూడా, ఎరగని మనిషి వద్ద నుంచి వరసగా కానుకలు పుచ్చుకోవటానికి బిడియపడి, ఒక పెద్ద బహుమానంతో ఈ బెడద వదిలించు కుందామనుకున్నాడు. అతను వర్తకుడికి ఇరవై ఉత్తమాశ్వాలనూ, ఇరవై ఒంటె



లనూ, ఇరవై ఏనుగులనూ ఇచ్చాడు. ఏనుగుల పైన ముత్యాల సరులు కూర్చిన అంబారీలు అమర్చాడు. గుర్రాలకు వెండి రికాబులూ, వెండి కళ్ళాలూ ఏర్పాటు చేశాడు. అరవై జంతువుల మీదా పట్టు శాలువలు పరిచాడు.

వీటన్నినీ వెంటబెట్టుకుని వర్తకుడు తన వద్దకు వచ్చేసరికి గుంజయుడికి మతిపోయి నట్టయింది.

"బాబూ, తమరు నా కోసం ఇప్పటికే చాలా శ్రమపడ్డారు. వీటిలో రెండు గుర్రాలూ, రెండు ఒంటెలూ, రెండు ఏనుగులూ తమరు ఉంచేసుకుని, మిగిలినవి రాజకుమార్తెకు చేర్చండి," అన్నాడతను వర్తకుడితో.

"అన్నీ నువే ఉంచుకో. నేను శ్రమపడినందుకు విచారించను. అందుకు తగిన ప్రతిఫలం నాకు ముట్టనే ముట్టింది. కాని మరొకసారి సాగోర రాజు ఎదటా, ఆయన కుమార్తె ఎదటా పడటానికి నాకు ధైర్యం లేదు. ఎవరు పంపుతున్నదీ తెలియకుండా బహుమానాలు పుచ్చుకోవటానికి వారు కిందటిసారే చాలా తటపటాయించారు. ఈసారి నిలవదీసి అడుగుతారు. మా ఊళ్లో గడ్డి అమ్ముకుని బతికే ముసలి గుంజయుడు ఈ బహుమానాలు పంపుతున్నాడని చెప్పమంటావా? అలా అయితేనే నేను సాగోర పురానికి వెళతాను," అన్నాడు వర్తకుడు.

గుంజయుడు చాలాసేపు బుర్ర గోక్కుని, "అలా ఎందుకు చెప్పటం? ఈ గుర్రాలూ, ఒంటెలూ, ఏనుగులూ ఎవరివో తమకు తెలీదా? అవి ఫలానా వారివని చెప్పండి. ఆ తరవాత మీకూ, నాకూ ఏ శ్రమా ఉండదు," అన్నాడు.

గుంజయుడి ఉద్దేశం వర్తకుడికి అర్థమయింది. ఆ ముసలివాడు తన కిస్తానన్న జంతువులను ఉంచేసుకుని, మిగిలినవాటిని తీసుకుని వర్తకుడు సాగోరపురం చేరాడు.





సాగోరరాజు తన రాజభవనం మీదినుంచి దూరాన దుమ్ము లేస్తూండటం చూశాడు; గుర్రాల సకిలింతలూ, ఏనుగుల ఘీంకారాలూ విని, తన దేశం మీది కెవరో దండెత్తి వస్తున్నారని భయపడ్డాడు. కాని ఆ జంతువులన్నీ తన కుమార్తెకు బహుమానమని వర్తకుడు చెప్పేసరికి ఆయన నివ్వెరపోయి, "వీటన్నిటినీ రాజకుమార్తెకు ఎవరు పంపుతున్నారో చెబితేనే గాని మేము స్వీకరించలేము," అన్నాడు.

"మహారాజా, ఇంకా నిజం దాచటం నాకు కూడా సాధ్యం కాదు. నేను తెచ్చిన జంతువులన్నీ విదర్భ రాజకుమారు డిచ్చినవి," అన్నాడు వర్తకుడు.

రాజు తన కుమార్తెతో రహస్యంగా సంప్రతించాడు.

"విదర్భ రాజకుమారుడు నిన్ను పెళ్ళాడగోరి, రాయబారిని పంపితే మనం పెళ్ళికి అంగీకరించక తన పరువుకు భంగం కలిగిస్తామేమోనని ఈ ఎత్తు వేశాడు. విదర్భ రాజకుమారుడికి నిన్ను పెళ్ళాడాలనే ఉండాలి గాని, మనకు అంతకన్న అదృష్టం ఉంటుందా?" అన్నాడు రాజు. ఈ మాటకు రాజకుమార్తె కూడా పరమానందం చెందింది.

రాజు వర్తకుడికి బోలెడన్ని కానుకలిచ్చి, "ఇక నీవు వెళ్ళవచ్చు. విదర్భ రాజకుమారుడికి ఈ సారి మేము కానుకను స్వయంగానే పంపుకుంటాం," అన్నాడు.

వర్తకుడు, "చిత్తం, అదే నేను కూడా కోరేది," అని, రాజు వద్ద శలవు పుచ్చుకుని ఉజ్జయినికి తిరిగి వెళ్ళిపోయాడు.

తరవాత సాగోర రాజు తన కుమార్తెనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని, తీర్థయాత్రలు చేసే నెపం మీద బయలుదేరి, అక్కడక్కడా మజిలీలు చేసుకుంటూ విదర్భ చేరాడు. ఆయన తన కుమార్తెను వెంట బెట్టుకుని విదర్భ రాజు వద్దకు వెళ్ళి,

"మీ కుమారుడు మా కుమార్తెకు పంపిన అమూల్యమైన కానుకలకు ఎంతైనా కృతజ్ఞులం. అవి ఏ ఉద్దేశంతో పంపటం జరిగినదో మాకు తెలియరాక, మా శక్తి కొద్దీ ప్రతి బహుమానాలు పంపాం. అయితే, కిందటిసారి మాకు వచ్చిన కానుక చూస్తే, ఈసారి రాజకుమారుడు కోరినది స్వయంగా తెలుసుకుని, మా శక్తికి మించని పక్షంలో సమర్పించుకుందామని నిశ్చయించాం," అని చెప్పాడు.

విదర్భరాజుకు ఇదేమీ అంతుబట్టలేదు. ఆయన ఆ సంగతి బయటపెట్టక, "అబ్బాయిని పిలిపిస్తాను. స్వయంగా మాట్లాడండి," అన్నాడు.

విదర్భ రాజకుమారుడు వచ్చాడు. సౌగోర రాజకుమార్తెను చూసి, ఆమె అందానికి అద్భుతం చెందాడు. ఆమె తండ్రి మాటలను బట్టి తనకు కానుకలు పంపినది ఈ రాజకుమార్తే నని అర్థమయింది. తనను పెళ్ళాడే ఉద్దేశంతోనే ఆమె తనకు కానుకలు పంపి ఉంటుందనుకుని అతను, "నేను మీ కుమార్తెను పెళ్ళాడగోరుతున్నాను. ఆమెను నా కిచ్చి చేసినట్టయితే అదే నాకు అన్నిటి కన్న గొప్ప కానుక అనుకుంటాను," అన్నాడు.

వారి పెళ్ళికి పెద్దలు కూడా అంగీకరించారు. దైవజ్ఞులు వచ్చి వెంటనే ముహూర్తం పెట్టారు. త్వరలోనే ఇద్దరికీ పెళ్ళి జరిగిపోయింది. తమ వివాహానికి మధ్యవర్తిగా పనిచేసిన గుంజయు డెవరో ఆ నూతన వధూవరుల కిద్దరికీ తెలియదు. ఆ వధూవరులు ఎలా ఉంటారో గుంజయుడికి కూడా తెలియదు. అతను ఎప్పటిలాగే రోజూ అడవికి పోయి, గడ్డి కోసి, మోపుకట్టి తెచ్చి, గుర్రాలు గలవారికి రెండున్నర అణాలకు అమ్ముకుని, అందులో రెండణాలు తన ఖర్చుకుపోగా మిగిలిన అర్ధణా వెనక వేసుకుంటున్నాడు.





# అనుమాన పిశాచం

కోసలదేశపు రాజుకు సునందుడూ, జీవకుడూ అని ఇద్దరు కుమాళ్ళుండే వారు. ఇద్దరూ తన కొడుకులే అయినా కూడా, రాజుకు పెద్ద కొడుకు పైన ప్రేమ కాస్త హెచ్చుగా ఉండేది. అందుకు కారణమేమంటే, సునందుడు తన అనంతరం రాజు కావలిసినవాడు. అదీ గాక, అస్త్ర విద్యలలో జీవకుడి కన్న సునందుడే ఎక్కువ ప్రవీణుడు.

అయితే జీవకుడికి తన తండ్రి అంటే అమితమైన ప్రేమాభిమానా లుండేవి. అతను అన్ని విధాలా ఎంతో యోగ్యుడే కాక వివేకవంతుడు కూడా.

కోసలదేశపు ప్రధానమంత్రికి వాసంతిక అనే కుమార్తె ఉండేది. రాజకుమారు లిద్దరూ చిన్నతనం నుంచీ ఆమెతో స్నేహంగా ఉంటూ, పెళ్ళియీడు వచ్చాక ఇద్దరూ ఆమెనే చేసుకుంటామని పట్టుబట్టారు.

"వాసంతిక మిమ్మల్ని ఇద్దరినీ ఎలా పెళ్ళాడుతుంది? మీరిద్దరూ ఏదో ఒక ఒడంబడిక చేసుకోండి," అని రాజూ, మంత్రీ కూడా రాజకుమారులకు చెప్పి చూశారు. కాని లాభం లేకపోయింది. ఇద్దరిలో ఏ ఒకరూ త్యాగానికి సిద్ధపడలేదు.

అప్పుడు రాజుగారు ఇద్దరికీ ఒక పోటీ ఏర్పాటు చేశాడు. రాజభవనం మీదినుంచి అన్నదమ్ము లిద్దరూ చెరొక బాణమూ వదలాలి. ఎవరి బాణం హెచ్చు దూరం వెళ్లినట్టు రుజువైతే వారు వాసంతికను వివాహం చేసుకోవాలి.

రాజుగారు ఇలాటి పరీక్ష ఎప్పుడైతే పెట్టాడో అప్పుడే జీవకుడు, తనకు వాసంతిక దక్కదనుకున్నాడు. అయినా అతను పోటీ చేశాడు.

సునందుడు రాజభవనం మీది నుంచి మొదట బాణం వదిలాడు. అది చాలా

ఆర్. శ్యామలరావు




దూరం వెళ్ళి కింద పడింది. తరవాత జీవకుడు కూడా తన శక్తి కొద్దీ బాణాన్ని వదిలాడు. కాని అది ఎంతదూరం వెళ్లిందో, ఎక్కడ పడిందో ఎవరికీ కనిపించలేదు. భటులు ఎంతో దూరం వెళ్ళి ఆ బాణం కోసం వెతికారు. కాని ఆ బాణం వాళ్ళకు దొరకనేలేదు.

"నిజానికి జీవకుడి బాణమే హెచ్చు దూరం వెళ్ళి ఉండవచ్చు. కాని అందుకు రుజువు లేదు. అందుచేత సునందుడే గెలిచినట్టు నిర్ణయించి, వాసంతికను సునందుడికే ఇచ్చి చేయ నిశ్చయించాం," అని రాజు ప్రకటించాడు. సునందుడి వివాహంతో బాటు, యౌవరాజ్యాభిషేకం కూడా జరపటానికి ఏర్పాట్లు జరిగాయి.

ఈ సందర్భంలో అందరూ పొందిన ఆనందం జీవకుడు పొందలేదు. అతనికి తన బాణం ఏమయిందో తెలుసుకోవాలని దృఢంగా సంకల్పం కలిగింది. అందుచేత అతను పెళ్లి వేడుక చూడటానికి కూడా ఉండకుండా, రాజభవనం విడిచి, తాను బాణం విడిచిన దిక్కు సూటిగా బయలుదేరాడు.

అతను నింపాదిగా నడుచుకుంటూ, తన బాణం కోసం వెయ్యి కళ్ళతో చూస్తూ దాదాపు పదహారు మైళ్ళు వెళ్లి కొండ ప్రాంతాన్ని చేరుకున్నాడు. చెక్కినట్టు నిటారుగా ఉన్న కొండ దగ్గిరికి అతను చేరుతూనే కింద పడి ఉన్న ఒక బాణాన్ని చూశాడు. పైకి తీసి చూస్తే అది తన బాణమే! కాని దాని ములికి తాను వచ్చిన వేపు తిరిగి ఉన్నది.

"ఇందులో ఏదో మాయ ఉన్నది. పదహారు మైళ్ళ దూరం వెళ్ళేటట్టు బాణం వెయ్యటం నా వల్ల కాదు గదా, హరిహరాదులకు కూడా సాధ్యం కాదు. అది అలా ఉంచి, ఈ బాణం ఇక్కడి దాకా వచ్చి నేలకు తగిలినట్టయితే, ములికి ముందుకు

ఉండాలి గాని, వెనక్కు ఉండే అవకాశం లేదు. అందుచేత నా బాణం ఇక్కడికి చేరటానికి మరెవరో కారణం అయి ఉండాలి," అనుకున్నాడు జీవకుడు.

ఆ ప్రాంతంలో ఎవరన్నా కనిపిస్తారేమో నని అతను కొండ వెంబడే నడవసాగాడు. కొంతదూరం నడిచేసరికి ఒక గుహ లాటిది కనిపించింది. జీవకుడు ధైర్యంగా గుహలోకి ప్రవేశించాడు. లోపలికి కొద్ది దూరం వెళ్ల గానే తలుపు లాటిది కనిపించింది. దాన్ని తోస్తే పక్కకు పోయింది.

జీవకుడా ద్వారం దాటి లోపలికి అడుగు పెట్టి ఆశ్చర్యంతో నిలబడి పోయాడు. కొండ లోపల అతి విశాలమైన ఆవరణ ఉన్నది. అందులో ఒక పెద్ద నగరమూ, రత్నాలతో ధగధగా మెరిసే భవనాలూ ఉన్నాయి. ఆ భవనాల మధ్యగా విశాలమైన మార్గమూ, ఆ మార్గం చివర ఒక దివ్యమైన రాజ భవనమూ కనిపించాయి.

జీవకుడు ఆ మార్గం వెంబడి రాజభవ నాన్ని చేరుకుని, లోపలికి అడుగు పెట్టాడు. లోపల ఒక పెద్ద చావడీ, అందులో అనేక మైన బంగారు ఆసనాలూ, వాటిమీద దేవతా స్త్రీలను మించే రూపురేఖలు గల అనేక మంది స్త్రీలూ ఉన్నారు. ఆ స్త్రీలలో రాణి అనిపించేలాగా ఉన్న ఒక సుందరి ఎదురు





వచ్చి, "రా, జీవకా! నీకు స్వాగతం," అంటూ ఆహ్వానించింది.

జీవకుడు మరింత ఆశ్చర్యపడుతూ, "ఎవరు నువు? నా పేరు నీ కెలా తెలిసింది? మా రాజధానికి ఇంత సమీపంలో మా కెవరికీ తెలియకుండా ఇక్కడ మీరందరూ ఎలా నివసిస్తున్నారు?" అని ఆమెను అడిగాడు.

"నేను యక్షేశ్వరుడి కుమార్తెను. నా పేరు శంపాలత. మా తండ్రి నా కోసం ఈ నగరం చాలా కాలం క్రితమే నిర్మించాడు. నేను నీ విషయాలన్నీ మొదటి నుంచీ శ్రద్ధగానే తెలుసుకుంటున్నాను. నిజానికి ఆ వాసంతిక నీకు భార్య కావటానికి అర్హురాలు కాదు. నీ అన్న కన్న చాలా గొప్ప యోగం కలవాడివి. అందుచేత నువు బాణం వదిలినప్పుడు నేను నా విద్యాకౌశలంతో దాన్ని అదృశ్యం చేసి ఈ ప్రాంతాల వచ్చి పడేటట్టు చేశాను. దాని కోసం నువు ఎప్పుడు వస్తావా అని ఎదురు చూస్తున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే నన్ను పెళ్ళాడి, ఇక్కడ అంతులేని దేవభోగాలు అనుభవించ వచ్చు," అన్నది యక్షిణి.

జీవకుడు తన చెవులను తానే నమ్మలేకపోయాడు. నిజానికి ఈ శంపాలత దేవతా స్త్రీ కావటమే గాక, వాసంతిక కన్న వెయ్యి రెట్లు సౌందర్యవతి. ఆమెను పెళ్లాడటానికి ఇష్టం లేకపోవట మనేది ఊహించటానికి కూడా వీల్లేదు.

"నీ యిష్టం! నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను. అదివరకే నా జీవితం నీ అధీన మయింది. నా జీవితమంతా ఇలాగే గడిచిపోతే నా కేమీ అభ్యంతరం లేదు," అన్నాడు జీవకుడు.

ఆతను ఆమె వెంట తిరిగి రాజభవనం అన్ని మూలలూ చూశాడు. ఎక్కడ చూసినా బంగారమూ, రత్నాలూ తప్ప అతనికి మరొకటి కనిపించలేదు. అలకా

పురం కూడా అంతకంటె అందంగా ఉంటుందని అతనికి తోచలేదు.

ఇద్దరూ వివాహం చేసుకుని, దాంపత్య జీవితం సాగించారు. కలలో కూడా ఊహించని సుఖాలన్నీ జీవకుడు ఇప్పుడు ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడు.

ఒక మాసం గడిచింది. జీవకుడికి తన తండ్రీ, మిగిలినవాళ్ళూ జ్ఞాపకం వచ్చారు. అతని మనస్సు కలవరపడింది. అతను ఎంతో విరక్తితో ఇల్లు విడిచి వచ్చాడు. తాను కనిపించకపోతే తనవాళ్ళు ఆదుర్దా పడతారన్న ఆలోచన కూడా అతనికి ఆ సమయంలో తట్టలేదు. అందరూ పెళ్లి అడావుడిలోనూ, యౌవరాజ్యాభిషేకం అడావుడిలోనూ ఉండటంచేత జీవకుడు ఎటో వెళ్ళిపోయిన సంగతి వెంటనే గమనించి ఉండరు. కాని గమనించినాక వాళ్ళు ఎంత బాధపడ్డారో అన్న ఆలోచన ఇప్పుడు జీవకుణ్ణి బాధించసాగింది.

యక్షిణి అతని విచారాన్ని గమనించి కారణ మడిగింది.

"నేను ఇంటి నుంచి చెప్పకుండా వచ్చేశాను. మళ్ళీ వెళ్ళి మా వాళ్ళందరినీ చూసి, వాళ్ళతో రెండు రోజులు గడిపి రావాలని ఉన్నది," అన్నాడు.



"తప్పకుండా వెళ్ళు. నీ ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ నేను చేస్తాను. కాని ఒక్కటే షరతు: నువు ఏ పరిస్థితులలోనూ నన్ను గురించి గాని, మనం ఉన్న ఈ ప్రదేశం గురించి గాని ఎవరికీ తెలియనివ్వరాదు," అన్నది శంపాలత.

అందుకు జీవకుడు సమ్మతించాడు. అతని ప్రయాణానికి గాను శంపాలత పెద్ద ఏర్పాట్లు చేసింది. అతనికి రత్నాలు పొదిగిన రథమూ, దాన్ని లాగటానికి దేవతాశ్వాలూ, అశ్వారూఢులైన పరివారమూ, అతని బంధువు లందరికీ, రత్నాభరణాలూ, బంగారు బట్టలూ సిద్ధం చేయబడ్డాయి.



చెప్పకుండా వెళ్ళిపోయి, దేవలోకం నుంచి దిగి వచ్చినట్టుగా తిరిగి వచ్చిన తన చిన్న కొడుకును చూసి రాజు చాలా సంతోషించాడు. మంత్రీ, మిగిలిన సభికులూ మాత్రం సంతోషించలేదు. ఏదో రాజకీయమైన ఉపద్రవం తెచ్చి పెట్టటానికే జీవకుడు తిరిగి వచ్చాడనీ, అతనికి తండ్రిపైనా, అన్నపైనా విరోధం తప్ప విహితం ఉండే అవకాశం లేదనీ వాళ్ళు అనుకున్నారు.

జీవకుడు తన తండ్రితో తాను సుఖంగా, ఏ లోటూ లేకుండా ఉంటున్నానని చెప్పాడు గాని, తాను ఉండే చోటు ఏదో చెప్పలేదు. తా నొక యక్షిణిని పెళ్ళాడిన సంగతి మొదలే చెప్పలేదు. తండ్రి ఎంత బలవంతం చేసినా ఉండక, అతను రెండు రోజుల అనంతరం తన పరివారంతో సహా తిరిగి వెళ్లిపోతూ, అప్పుడప్పుడూ వచ్చి పోతూ ఉంటానని తండ్రికి మాట ఇచ్చాడు.

జీవకుడు తిరిగి వెళ్ళాక మంత్రి మొదలైన వాళ్ళు రాజును గట్టిగా హెచ్చరించుతూ, జీవకుడు కోసలరాజ్యం కాజెయ్యటానికి ఏవో రహస్య యత్నాలు చేస్తున్నాడనీ, అతని కెవరో బలవంతులు సహాయం చేస్తున్నారనీ అన్నారు.

అనుమాన పిశాచం రాజు బుర్రలో కూడా ప్రవేశించింది. మంత్రి మొదలైన వారి అనుమానం సరి అయినదే అయి ఉండాలి. మంత్రి కుమార్తెను తాను పెళ్ళాడలేక పోయినందుకు అలిగి, ఎంతో వైభవంగా జరిగిన తన అన్న పెళ్ళికి కూడా ఉండక, ఎవరితోనూ చెప్పకుండానే వెళ్ళిపోయిన జీవకుడు కేవలమూ తన మీది ప్రేమకొద్దీ తిరిగివస్తాడా? అతనికి ఈ ఐశ్వర్యమంతా ఎక్కడిది? ఈ పరివారమంతా ఏ రాజు ఇచ్చాడు? అసలు జీవకుడు ఎక్కడి నుంచి వచ్చాడో, ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు. అతను చెప్పనైనా లేదు. అతను ఇక్కడి పరిస్థితులు తెలుసుకునే

టందుకే వచ్చాడు; అప్పుడప్పుడూ వస్తానని మాట ఇచ్చినది కూడా అందుకేనని రాజుకు తోచింది.

మరొక నెల గడిచింది. జీవకుడు ఈసారి మరింత వైభవంగా, మరింత హెచ్చు పరివారంతో తండ్రిని చూడవచ్చాడు. అప్పుడు తండ్రి, "నాయనా, నువు తరుచు ఇలా వచ్చిపోతూ ఉండటం నాకు సంతోషంగానే ఉన్నది. కాని నువు ఇక్కడే ఎందుకు ఉండిపోగూడదు? నీ కిక్కడ ఏంలోటు?" అని జీవకుణ్ణి అడిగాడు.

"అది సాధ్యంకాదు. నా జీవితాన్ని మరొక చోట పాతుకున్నాను. నా సుఖ సంతోషాలకు నిజమైన ఆశ్రయం అదే," అన్నాడు జీవకుడు.

"ఆ చోటు ఏది? నువు ఇక్కడికి వచ్చినట్టే మేం కూడా అక్కడికి వస్తూ పోతూ ఉంటాం," అన్నాడు రాజు.

"ఆ మాట మాత్రం అడగకండి. నే నుండే చోటు ఎవరికీ చెప్పకూడదు. అది నా జీవితరహస్యం. మీ రెవరూ నే నుండే చోటికి రారాదు," అన్నాడు జీవకుడు.

రాజుగారి అనుమానం మరింత దృఢపడింది. జీవకుడు వెళ్ళిపోయాక ఆయన




తన మంత్రి మొదలైన వారితో ఆలోచనలు జరిపాడు. జీవకుడు ఉండే చోటు తెలుసుకోవటం అవసరమని వాళ్ళు ఆయనకు సలహా ఇచ్చారు.

మరొక నెల గడిచాక జీవకుడు మరొకసారి తండ్రిని చూడవచ్చాడు. ఈసారి అతని వెంట ఇంకా హెచ్చు పరివారం ఉన్నది, ఎన్నో బహుమానాలు తెచ్చాడు.

"పరివారం అన్న పేరు పెట్టుకుని వీడు ఒక్కొక్క సారికీ మరింత పెద్ద సేనతో వస్తున్నాడు. ఇలా వచ్చి, వచ్చి ఒకనాడు రాజ్యం ఆక్రమించి, మరి వెళ్ళడు," అనుకున్నాడు రాజు.



జీవకుడు తిరిగి వెళ్ళేటప్పుడు, అతను ఎక్కడికి పోతాడో చూసి రమ్మని రాజుగారు ఒక వేగులవాణ్ణి పంపాడు. ఆ వేగులవాడు ఎంతో రహస్యంగా జీవకుడి పరివారానికి కొంత ఎడంగా నడుస్తూ, వాళ్ళతో పాటు కొండల దాకా వెళ్ళాడు.

వాడు చూస్తూండగానే ఆ పరివారం కొండ లోకి ఇంకిపోయి, అదృశ్యమయింది. వాళ్ళు అదృశ్యమైన చోటికి వాడు వెళ్ళి చూశాడు, కాని వాడికి అక్కడ ఒక ద్వారంగాని, గుహకాని కనిపించలేదు. దానికి కారణ మేమంటే, అక్కడ ఉన్న గుహ అందరికీ కనిపించదు; ఎవరికైతే కనిపించాలని యక్షిణి అనుకుంటుందో వారికి మాత్రమే కనిపిస్తుంది.

వేగులవాడు తిరిగి వచ్చి రాజుగారితో తాను చూసిన సంగతి చెప్పాక, రాజుగారు మరింత బెదిరిపోయి తన అనుచరులతో మరొక చర్చ జరిపాడు.

"రాజకుమారుడికి అండగా ఉండి మన రాజ్యంపైన కుట్ర చేస్తున్న శక్తులు మానవ శక్తులని తోచదు. ఏవో అమానుష శక్తుల సహాయం అతనికి ఉన్నట్టు కనబడుతుంది. ఈ సంగతి మనం రుజువు చేసుకోవటం అవసరం. అలాటి పరిస్థితిలో మనం మరింత జాగ్రత్తగా ఉండాలి," అన్నాడు ప్రధానమంత్రి.

"జీవకుడి వెనక ఉన్నవి అమానుష శక్తులో, కాదో ఎలా రుజువవుతుంది?" అని రాజు అడిగాడు.

"ఒక అసాధ్యమైన వస్తువు తెచ్చి పెట్టమని తమరు జీవకుణ్ణి మంచిగానే అడగండి. తెచ్చిపెట్టాడా, మన అనుమానం రుజువవు తుంది. తమరు వేటకు వెళ్ళేటప్పుడు, ఎండ వచ్చినా, వాన వచ్చినా, తమ పరివారమంతా తలదాచుకునేటందుకూ, యుద్ధానికి వెళ్ళితే సేన యావత్తూ తలదాచుకునేటందుకూ సరిపడే డేరా ఒకటి, మడిచి గుప్పిట పట్టు

కుంటే ఇమిడేది తీసుకురమ్మని జీవకుణ్ణి అడగండి," అన్నాడు మంత్రి.

ఈసారి జీవకుడు తనను చూడవచ్చినప్పుడు రాజు అతన్ని మంత్రి అడగమన్నట్టే అడిగాడు. తండ్రి కోరికకు ఆశ్చర్యపోయి జీవకుడు, "ప్రయత్నిస్తాను," అన్నాడు. అతను తన భార్య వద్దకు తిరిగి వెళ్ళి తన తండ్రి కోరిక గురించి చెప్పాడు.

"అలాటి డేరా మసం తేలికగా సృష్టించుకోవచ్చు," అని శంపాలత ఈ సారి అతను తండ్రిని చూడబోయేటప్పుడు ఒక డేరా మడత ఇచ్చింది. దాన్ని తీసుకు పోయి జీవకుడు తండ్రి కిచ్చాడు. రాజు ఆ మడతను విప్పటం ఆరంభిస్తే డేరా ఒక కోసు పొడుగూ, ఒక కోసు వెడల్పూ ఉండేటట్టు కనిపించింది.

జీవకుడు వెళ్ళాక రాజు మళ్ళీ రహస్య సమావేశం జరిపి, "నా కొడుక్కు ఏదో అమానుష శక్తి సహాయం చేస్తున్నదనటానికి సందేహం లేదు. ఇప్పుడు కర్తవ్య మేమిటి?" అని తన సలహాదార్లను అడిగాడు.

"ఈ సారి జీవకుడు వచ్చినప్పుడు అతన్ని హత్య చేయించండి," అని ఒకరు సలహా ఇచ్చారు. అందుకు రాజు ఒప్పుకోలేదు. జీవకుడు దుస్తంత్రం పన్నుతున్నట్టూ,




ద్రోహం తలపెట్టినట్టూ సాక్ష్యం లేకుండా అతన్ని హత్య చేసేస్తే, అతని వెనక ఉన్న అమానుష శక్తులు చూస్తూ ఊరుకోవనీ, అది కొరివితో తల గోక్కోవట మవుతుందనీ ఆయన అన్నాడు.

"నిజమే, మహారాజా. మనం యుక్తి చేతనే అపాయం తప్పించాలి. ఎంత సేననైనా జయించగలవాడు మన పక్షాన ఉండి, వాడు తమరి చెప్పుచేతలలో ఉండేటట్టుంటే మన రాజ్యానికి భంగం రాదు. అలాటి బలాఢ్యుణ్ణి ఒకణ్ణి తీసుకు రమ్మని తమరు జీవకుణ్ణి అడగండి. అతను మీ కోరిక తీర్చిన పక్షంలో అతనికి దురుద్దేశం



లేదని తేలిపోవటమే కాకుండా, మన కిక ఏ శత్రువు నుంచీ భయం ఉండదు," అన్నాడు మంత్రి.

జీవకుడు మరొకసారి తనను చూడ వచ్చినప్పుడు రాజు, "నాయనా, నాకు శత్రు భయం ఇటీవల చాలా జాస్తి అయింది. ఎంతటి సేననయినా జయించగలిగి, నేను చెప్పినట్టు నడుచుకోగల వాణ్ణి ఎవణ్ణయినా తీసుకు రాగలిగితే నేను నిశ్చింతగా ఉంటాను," అన్నాడు.

ఈ కోరిక జీవకుడికి అసాధ్యంగా కనబడింది. అయినా అతను వెళ్ళి తన భార్యకు తండ్రి కోరిక తెలిపాడు.

"మీ తండ్రి కోరదగనిది కోరాడు," అన్నది శంపాలత.

"నే నప్పుడే అనుకున్నాను, అలాటి బలాఢ్యుడు ఎక్కడా ఉండడు," అన్నాడు జీవకుడు.

"ఉండటం ఉన్నాడు. మా అన్నే అలాటివాడు. నేను చెబితే మీ తండ్రి వద్దకు వెళ్ళి, ఆయన ఏది చెయ్యమంటే అది చేస్తాడు. కాని మా అన్న చాలా ముక్కోపి, దురుసుమనిషి. అతనితో మీ తండ్రి వేగగలడా అని నా సందేహం," అన్నదామె.

"మా తండ్రి చెప్పినట్టు వినేపక్షంలో మీ అన్న ఎంత ముక్కోపి అయినా ఫరవా లేదు. దయచేసి అతన్ని మా తండ్రి దగ్గిరికి పంపగలవా?" అన్నాడు జీవకుడు.

"ఆలశ్యమెందుకు, ఇవాళే పంపుతాను," అన్నది శంపాలత.

ఆ రోజు కోసలలో రాజు కొలువుతీరి ఉండగా ఒక భయంకరాకారుడు, ముప్పై మణుగుల బరువుగల ఇనప గద ఒకటి భుజాన పెట్టుకుని, భూమి అదిరేటట్టు నడుచుకుంటూ వచ్చి, రాజుగారి ఎదట నిలబడి, "నన్ను రమ్మన్నావుట? ఏం పని ఉండి రమ్మన్నావు?" అని సభ మారుమోగేటట్టు అడిగాడు.

అందరూ భయంతో వణికిపోయారు. రాజుగారు ఆ ఆకారాన్ని చూడలేక రెండు చేతులా కళ్ళు మూసుకున్నాడు.

"ఎందుకు పిలిపించావని అడుగుతుంటే, ఏం మాట్లాడవు?" అంటూ ఆ భయంకరాకారుడు తన గదతో రాజు నెత్తి మీద మొత్తాడు. వెంటనే రాజు తల పగిలి చచ్చిపోయాడు.

"అయ్యో, అయ్యో! దౌర్జన్యం!" అని మంత్రి మొదలైనవాళ్ళు ఆక్రోశించారు. ఆ భయంకరాకారుడు వారందరినీ తన గదతో మొత్తాడు. అందరూ చచ్చారు.

చచ్చినవారు చావగా సభలో మిగిలిన వాళ్ళందరూ కుక్కిన పేనుల్లాగా అయారు. వాళ్ళతో ఆ వ్యక్తి, "రాజుగారు ఏం చెబితే అది చెయ్యమని నన్ను మా బావమరిది అయిన జీవకుడు పంపాడు. కాని మీ రాజు నన్ను చూసి భయపడ్డాడు. అలాటి వాడి కింద నేను ఎలా సేవచేస్తాను? ఇకనుంచీ మీ రాజ్యానికి మా బావమరిది జీవకుడే రాజుగా ఉంటాడు. అందుకు అభ్యంతరం చెప్పేవాళ్ళెవరన్నా ఉంటే ఇప్పుడే చెప్పండి," అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. శంపాలత అన్న, తిరిగి వెళ్ళిపోయాడు. జరిగిన సంగతి విని జీవకుడు చాలా విచారించాడు.

"నీ తండ్రి నిన్ను శత్రువు కింద జమ కట్టిన నాడే తన దుర్మరణం కోరి తెచ్చుకున్నాడు. నిన్ను రహస్యంగా చంపించాలన్న ఆలోచన కూడా జరిగింది. మనుష్యులు తమ కోరికలను సఫలం చేసుకున్నట్టే, తమ భయాలను కూడా అప్రయత్నంగా సఫలం చేసుకుంటారు," అన్నది శంపాలత.

ఆ తరవాత ఆ దంపతు లిద్దరూ తమ రహస్య ప్రదేశం నుంచి సపరివారంగా కోసలకు వచ్చి, అక్కడ రాజ్యాభిషేకం చేసుకుని చాలా కాలం పాలించారు.





# రాగిరేకు

ఒక గ్రామంలో వెంకడు అనే పేద వాడొక డుండేవాడు. వాడికి గల ఆస్తి ఒక ఎద్దు బండి. ఊళ్ళో ఉండే ఒక వర్తకుడు అప్పుడప్పుడూ సరుకులు చేరవెయ్యటానికి వెంకడి చేత బండి కట్టించేవాడు. అయితే ఇది నిలకడగా ఉండే సంపాదన కాదు. అందుచేత వెంకడు తవ్వుడు పనులకూ, కప్పులు నేయటానికీ, ఇతర చిల్లర పనులకూ పోతూండేవాడు. ఎన్ని రకాల పనులు చేసినా వాడి పేదరికానికి మాత్రం చలనం ఉండేది కాదు.

ఒకనాడు వెంకడు తన బండి మీద సరుకులు వేసుకుని, బస్తీ నుంచి వర్తకుడి ఇంటికి తెస్తూండగా దారి పక్కన ఒక ముసలి బైరాగి కనిపించాడు. అతను ఒక చెట్టు కింద పడుకుని, ఏదో జబ్బుతో బాధ పడుతున్నట్టున్నాడు. ఆ బైరాగి వెంకణ్ణి ఆగమని చేత్తో సైగ చేసి, "నాయనా, నాకు చాలా జబ్బుగా ఉంది. నీ బండి మీద ఊళ్ళోకి చేర్చుతావా?" అని అడిగాడు.

వెంకడు ఆ బైరాగిని పట్టుకుని బండి ఎక్కించి, ఊరు చేరాక, "ఊళ్ళో ఎక్కడికి పోతావు?" అని బైరాగిని అడిగాడు.

"నాకీ ఊరు తెలీదు. ఏ సత్రానికో, మఠానికో చేర్చు. నీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు బైరాగి.

ఆ ఊళ్ళో సత్రమూ లేదు, మఠమూ లేదు. ఎవరింటికి తీసుకుపోతే ఎవరూరుకుంటారు? జబ్బుగా ఉన్న ఈ బైరాగి భారాన్ని ఎవరు మాత్రం ఎందుకు భరిస్తారు? అందుకని వెంకడు ఆ బైరాగిని తన ఇంటికే చేర్చి, సరుకులను వర్తకుడి ఇంటికి తోలుకుపోయి, మళ్ళీ ఇల్లు చేరుకున్నాడు.

వెంకడు తిరిగి వచ్చేసరికి బైరాగి గుడిసెలో ఒక మూల పడుకుని బాధతో

సి. జగపతిరాజు



మూలుగుతున్నాడు. వెంకణ్ణి అతని భార్య అవతలికి తీసుకుపోయి, "ఈ దారేపోయే శనిని కొంప మీది కెందుకు తెచ్చావు? ఆ మనిషి ఏ క్షణాన అయినా చచ్చేటట్టు న్నాడు. ఎవడో ఊరూ పేరూ లేనివాడు మనింటో చస్తే మనం ఎంత చిక్కులో పడి పోతామో ఆలోచించావా?" అన్నది.

వెంకడు భార్యను ఎలాగో సమాధాన పరిచి, "పాపం ఆ రోగికి ఇంత గంజి కాచి పొయ్యి," అన్నాడు. వెంకడి భార్య అలాగే చేసింది. అయితే ఆమె భయపడ్డంతా అయింది. బైరాగి అర్థరాత్రి వేళ ప్రాణాలు వదిలాడు.

"చూశావా, ఎటువంటి పీడ మనని చుట్టుకున్నదో? బైరాగివాడి డబ్బుకు ఆశపడి మనమే వాణ్ణి హత్య చేశామని లోకులు నింద వేస్తారు. ఈ శవాన్ని పాతిపెట్టటానికి బోలెడంత ఖర్చు," అన్నది వెంకడి భార్య.

"జరిగిందేదో జరిగింది. ఇప్పు డేం చేద్దా మంటావు?" అన్నాడు వెంకడు.

"ఇంక చేసే దేముంది? చీకటి పడి వచ్చిన ఈ బైరాగి మనింటో చచ్చినట్టు ఎవరికీ తెలీదు. తెల్లారే లోపుగా ఈ శవాన్ని ఎక్కడైనా పూడ్చి మాయం చెయ్యి," అన్నది వెంకడి భార్య.




వెంకడి ఇంటి వెనక కొంత దూరాన ముళ్ళపొద లున్నాయి. వాటి మధ్య ఒక గొయ్యి తవ్వి, ఇంటికి తిరిగి వచ్చి, శవాన్ని తీసుకుపోయి ఆ గోతిలో పూడ్చిపెట్టి, తూర్పు తెల్లవారే లోగా ఇంటికి వచ్చేశాడు వెంకడు. వెంకడు తవుగోలతో పొదల మధ్య నుంచి వెళ్లిపోవటం ఆ మసక వెలుతురులో దూరాన ఉన్న ఒక మనిషి చూశాడు. వెంకడు ఏదో నిక్షేపం పాతిపెట్టినట్టు ఆ మనిషి అనుమాన పడి, దగ్గిరికి వచ్చి, పై మట్టిని కెలికి చూస్తే అడుగున శవం కొద్దిగా కనబడింది. అదేదో హత్యకు సంబంధించిన విషయమని భయ పడి, ఆ మనిషి ఊరుకున్నాడు.





గుడిసె మూల బైరాగి జోలె ఉండిపోయింది. అందులో ఏవో చింకి గుడ్డలూ అవీ మాత్రమే ఉన్నాయి. వెంకడా జోలెను దూరంగా పారేసి వచ్చాడు. మర్నాడు తన పిల్లలు, "రాత్రి వచ్చిన బైరాగి ఏడీ?" అని అడిగితే, "తెల్లారుఝామునే వెళ్ళిపోయాడు," అన్నాడు వెంకడు.

వాళ్ళు ఉదయం పూట చెరువులో ఓలలాడటానికి పోయేటప్పుడు, బైరాగి జోలె కనిపించింది. అందులో వెతికితే వాళ్ళకు చిలుము పట్టిన రాగి రేకొకటి దొరికింది.

ఊళ్ళో పిల్లలకు చదువు చెప్పే పంతులు చెరువు దగ్గిరికి వచ్చి, వెంకడి పిల్లల దగ్గిర ఉన్న రాగిరేకు తీసుకుని చూస్తే దాని మీద అక్షరా లున్నట్టు తెలిసింది. ఆయన దాన్ని మట్టితో కిలుము పోయేటట్టు తోమి, దాని మీద ఉండే అక్షరాలు చదువుకుని, ఆశ్చర్యపడి, "ఇది మీకు ఎక్కడ దొరికింది?" అని పిల్లల్ని అడిగాడు.

"నిన్న సాయంకాలం ఒక బైరాగి చీకటి పడి మా ఇంటికి వచ్చి వెళ్ళిపోయాడు. పోతూ పోతూ ఆ బైరాగి తన జోలె పారేసి పోతే ఆ జోలెలో మా కీ రేకుముక్క దొరికింది," అని వాళ్ళు చెప్పారు.

వాళ్ళు చెప్పిన గుర్తులను బట్టి పంతులు బైరాగి జోలె ఉన్న చోటికి పోయి వెతికితే చింకి గుడ్డలు తప్ప మరేమీ దొరకలేదు. ఆయన వెంకడి దగ్గిరికి వెళ్ళి రహస్యంగా, "మీ ఇంటికి నిన్న బైరాగి వచ్చాడట, ఏమయాడు?" అని అడిగాడు.

"ఏమయాడో నాకూ తెలియదండీ. చెప్పకుండా పెట్టకుండా వెళ్ళిపోయాడు. జోలె పట్టుకు పోలేదు. నేనే దాన్ని అవతల పారేశాను. అందులో పనికొచ్చేదేమీలేదు," అన్నాడు వెంకడు.

పంతులు రాగిరేకు చూపించి, "దీన్ని ఆ బైరాగి నీకుగాని ఇచ్చాడా ఏమిటి?" అని అడిగాడు.



వెంకడు దాన్ని ఇటూ అటూ తిప్పి చూసి, "లేదండీ. ఇదీ జోలెలోనే ఉన్నది. జోలెతో పాటు పారేశాను," అన్నాడు.

"పిచ్చివాడా, దీనితో ఎంత ఐశ్వర్యం సంపాదించుకోవచ్చో నీకు తెలుసా? ఇందులో సిద్ధ బైరాగిమంత్రం ఉన్నది. శ్మశానంలో ఏనాడో శవాలతోపాటు పూడ్చిన నిధులు, ఈ మంత్రం చదివిన వాడికి లభిస్తాయి. అమావాస్యనాడు అర్ధరాత్రి వేళ శ్మశానంలో ఉండే పాతాళగుహ ఈ మంత్రం చదివితే మూడుమ్ముక్కాలు ఘడియల పాటు తెరుచుకుంటుంది. ఈ లోపుగా మంత్రం చదివిన వాడు సాధ్యమైనంత ధనం తెచ్చుకోవచ్చు," అన్నాడు పంతులు.

పంతులు చదవగా వెంకడు మంత్రాన్ని కంఠస్థం చేశాడు. మరి మూడు రోజుల అనంతరం అమావాస్య వచ్చింది. అర్ధరాత్రికి ముందే పంతులూ, వెంకడూ కలిసి శ్మశానానికి వెళ్ళారు. పంతులు శ్మశానం వెలపలే ఉండి, వెంకణ్ణి లోపలికి పంపిస్తూ, "సరిగా అర్ధ రాత్రి కాగానే చెబుతాను. మంత్రం చదువు. నిధి కనిపిస్తే సాధ్యమైనంత పట్టుకురా! మూడుమ్ముక్కాలు ఘడియలు మించి శ్మశానంలో ఉండకు సుమా," అని హెచ్చరించాడు.

పంతులు చేసిన హెచ్చరిక వినగానే వెంకడు మంత్రం చదివాడు. మంత్రం పూర్తి కాగానే వెంకడికి నేలలో ఒక పెద్ద గుహ కనిపించింది. దానిలోపల పట్టపగలు లాగా ఉన్నది. ఎన్నో రత్నాలూ, ఎంతో బంగారమూ ఉన్నది. వెంకడు రెండు గుప్పిళ్ళు బంగారం తీసుకుని బయటికి వచ్చేశాడు. ఒక గుప్పెడు తా నుంచుకుని, మరో గుప్పెడు పంతులు కిచ్చాడు.

వెంకడి వంటి నిరుపేద దగ్గిర బంగారం ఉండటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఆ నాడు తెల్లవారుఝామున అతను బైరాగి శవాన్ని పాతెయ్యటం చూసిన మనిషి తాను

చూసిన సంగతిని వర్తకుడికి చెప్పాడు. వర్తకుడు కూడా వెంకడి చేతిలో డబ్బు ఆడటం చూసి ఆశ్చర్యపోయినవాడే. ఆయన వెంకణ్ణి పిలిపించి, "నీ దగ్గిర బంగారం ఎక్కడిది? ఎవరిని హత్య చేసి ఈ బంగారం కాజేశావు? నిజం చెప్పకపోతే నీ మీద ఫిర్యాదు తెస్తాను," అన్నాడు.

వెంకడు బెదిరిపోయి, జరిగినదంతా వర్తకుడికి చెప్పి, రాగిరేకు కూడా చూపించాడు. "దీన్ని నా దగ్గిర ఉండనీ. అమావాస్యనాడు దీని సంగతి అంతు తేల్చుతాను. నీ మాట అబద్ధమయిందో నిన్ను ఉరి తీయిస్తాను. నిజమయే పక్షంలో ఈ రాగిరేకును నా వద్దనే ఉంచుకుని, నీకెప్పు డెంత కావలిస్తే అది నేనే ఇస్తూంటాను," అన్నాడు వర్తకుడు.

వెంకడు సరేననక తప్పలేదు.

మళ్ళీ అమావాస్య వచ్చింది. వర్తకుడు అర్ధరాత్రి వేళ చిన్న దీపం వెంట తీసుకుని, రాగిరేకు చేత పట్టుకుని, చంకన ఒక గోతం సంచీ తీసుకుని శ్మశానానికి వెళ్ళాడు. అర్ధరాత్రి కాకమునుపే రాగిరేకు మీది మంత్రం దీపం వెలుతురులో మళ్ళీమళ్ళీ చదువుతూ కూర్చున్నాడు. సరిగా అర్ధరాత్రి అయే సమయానికి అతని ఎదట పెద్ద వెలుగు కనిపించింది. ఆ వెలుగు వచ్చే గుహలో అంతులేని ధనరాసులున్నాయి. వర్తకుడు సంచీతో సహా ఆ గుహలో ప్రవేశించి, మంచి విలువైన రత్నాలను మాత్రమే ఏరుకుంటూ గుహ లోపలికి పోయాడు. అతని గోతం ఇంకా నాలుగోవంతన్నా నిండకముందే వెలుగు ఆరిపోయింది. గుహ మూసుకు పోయింది. మూడుమ్ముప్పావు ఘడియలలో బయటికి రావాలన్న మాట వర్తకుడు మరిచాడు.

వర్తకుడు ఏమయాడో ఊళ్లో ఎవరికీ తెలీదు. ఆయన పట్టు కెళ్ళిన లాంతరు మాత్రం శ్మశానంలో దొరికింది.





# కృష్ణావతారం

కరవీరపురం చేరుతూనే కృష్ణుడు అక్కడి కావలివాళ్ళతో తాను ఫలానా అనీ, సృగాల వాసుదేవుడితో యుద్ధానికి తామంతా వచ్చామనీ, వెంటనే ఆ సృగాలవాసుదేవుడు వచ్చి యుద్ధం చెయ్యవలిసిందనీ చెప్పి కబురు చేశాడు. వాళ్ళు వెళ్ళి తమ రాజుకు యీ వార్త చెప్పారు.

ఆ మాట వింటూనే సృగాలవాసుదేవుడు కోపంతో కళ్ళెర్ర చేసి, పూర్వం సూర్యుడు తనను మెచ్చి ఇచ్చిన బంగారు రథం ఎక్కి, బంగారు కవచం ధరించి, అమోఘమైన విల్లూ, బాణాలూ, ఖడ్గమూ మొదలైన ఆయుధాలు వెంట తీసుకుని, సైన్యాన్ని వెంట రావద్దని చెప్పి, ఒంటరిగా బయలుదేరి వచ్చాడు.

యమధర్మరాజు లాగా వచ్చే సృగాల వాసుదేవుణ్ణి చూసి బలరామకృష్ణులు సంభ్రమం చెందారు. దమఘోషుడు వారిద్దరికీ ఉత్సాహం కలిగించాడు. తరవాత కృష్ణుడు తన రథాన్ని శత్రురథానికి ఎదురుగా నడిపించుకుంటూ వెళ్ళాడు. ఆ మీద ఇద్దరికీ భయంకరమైన ద్వంద్వ యుద్ధం జరిగింది.

ఒకరి పైన ఒకరు బాణవర్షం కురిపించారు. ఒకరు వేసిన అస్త్రాలను ఒకరు ఛేదించారు. కృష్ణుడు తన విరోధి విల్లు విరగగొట్టి, సారథిని చంపాడు. సృగాలవాసుదేవుడు లక్ష్యపెట్టక, మరొక విల్లు తీసుకుని, రథాన్ని తానే నడుపుకుంటూ కృష్ణుడితో, "గోమంతం దగ్గిర కొందరు

14. సృగాలవాసుదేవుడి వధ



రాజులను జయించి, ఆ గర్వంతో ఇక్కడికి వచ్చావు. ఆ రాజులు మూర్ఖులు, అల్పులు. నేను ఒంటరిగా వచ్చాను. నువు కూడా ఒంటరిగానే నాతో యుద్ధానికి వచ్చావు. ఇది ధర్మయుద్ధం. ఈ ప్రపంచంలో ఇద్దరు వాసుదేవు లుండటానికి వీల్లేదు. అందుచేత నిన్ను చంపి, నేనొక్కణ్ణే వాసుదేవు డనిపించుకుంటాను," అన్నాడు.

కృష్ణుడు వెటకారంతో, "నీలో ఇంకా యుద్ధ వాంఛ ఉన్నట్టయితే నీ ప్రతాపం చూపించు, చూస్తాను. తరవాత నేను చేసేదేదో చేస్తాను. దాన్ని గురించి ఇప్పుడు చెప్పవలసిన పని లేదు," అన్నాడు.

సృగాలవాసుదేవుడు అతి వేగంగా కృష్ణుడి పై బాణాలూ, తోమరాలూ, చక్రాలూ, గొడ్డళ్ళూ, పరిఘలూ, ఖడ్గాలూ విసిరి, చీకటి కమ్మేలాగా చేశాడు.

కృష్ణుడది చూసి, "నీ శక్తి చూపావు, చూశాను. ఇదుగో నేను చెయబోతున్నది," అంటూ తన చక్రాయుధాన్ని అతడి మీద ప్రయోగించాడు. అది మహాభయంకరంగా తిరుగుతూ మెరుపులా వెళ్ళి, సృగాలవాసుదేవుడి తలను రెండుగా నరికి, కృష్ణుడి చేతికి తిరిగి వచ్చింది.

ఈ విధంగా సృగాలవాసుదేవుడు యుద్ధంలో చనిపోయాడని విని, అతని అంతఃపుర కాంతలు గొల్లున ఏడుస్తూ తమ భర్త పడిపోయిన చోటికి వచ్చారు. పట్టపు రాణి తన కొడుకైన శక్రదేవుణ్ణి తెచ్చి, కృష్ణుడి పాదాల మీద పడేసి, ఏడ్చింది. కృష్ణుడామె నోదార్చి, మంత్రులనూ సామంతులనూ, పౌరముఖ్యులనూ, పురోహితులనూ పిలిపించి, శక్రదేవుడికి రాజ్యాభిషేకం చేయించాడు.

తరవాత కృష్ణుడు మధురకు తిరిగి పోతాడని తెలిసి అతని మేనమామ అయిన దమఘోషుడు, వెళ్ళివస్తానని చెప్పి, తన సైన్యంతో సహా చేదిదేశానికి వెళ్ళిపోయాడు.

బలరామకృష్ణులు అయిదు రోజులు ప్రయాణించి ఆరో నాటికి మధురా నగరాన్ని చేర వచ్చారు. నగరం అంత దూరాన కనబడగానే కృష్ణుడు పాంచజన్యం పూరించాడు. ఆ శంఖనాదం విని యాదవులు, ఉగ్రసేనుణ్ణీ, ప్రధాన పురోహితులనూ వెంటబెట్టుకుని, ఏనుగులనూ, గుర్రాలనూ, సైనికులనూ ఆయత్తపరిచి, గొడుగులు తీసుకుని, మంగళవాద్యాలతో సహా ఎదురు వచ్చారు. వందిమాగధుల స్తోత్రాలూ, బ్రాహ్మణుల ఆశీర్వాదాలూ మారుమోగుతూండగా బలరామకృష్ణులు మహావైభవంగా మధురా ప్రవేశం చేశారు.

కృష్ణబలరాముల చేత ఓడిపోయి మగధకు తిరిగి పోయిన జరాసంధుడు అవమానంతో కుమిలిపోతున్నాడు. అంతమంది రాజులనూ, అంత సేననూ వెంట పెట్టుకుని పోయి, ఇద్దరు యాదవ కుమారుల చేతిలో ఓడి పారిపోవటం కన్న సిగ్గుబాటు ఇంకేముంటుంది? ఈ అవమానంతో అతనికి మనశ్శాంతి లేకుండా పోయింది.

చివరకు జరాసంధుడు రాజుల నందరినీ తిరిగి సమావేశపరిచి, "పాపిష్ఠి దేవుడు అనుకూలించక పాయేసరికి మనం, ఇంత బలపరాక్రమా లుండి కూడా ఇద్దరు గోప బాలకుల చేతిలో దెబ్బ తిన్నాం. మనకు





కలిగిన ఈ అపఖ్యాతి శాశ్వతంగా ఉండి పోతుంది. అలా కాకుండా చెయ్యాలంటే మనం ఆ యాదవు లిద్దరినీ ఎలాగైనా చంపటం తప్ప మరొక మార్గం లేదు. మీ రందరూ మీ మీ సైన్యాలతో మధుర పైకి బయలుదేరండి. మన బలాల ముందు క్షుద్రులైన యాదవులు నిలవటం కల్ల," అని చెప్పాడు.

ఈ మాటకు అందరూ సమ్మతించారు. ఎందుచేతంటే, వారంతా గోమంతం దగ్గిర అవమానం పొందినవారే. పై పెచ్చు వారిలో జరాసంధుడి దాయాదులూ, సగోత్రికులూ, మిత్రులూ, బంధువులూ



ఉన్నారు. పౌండ్ర, కళింగ, దంతవక్త్ర, శిశుపాల, సాల్వ, రుక్మి, గాంధార, త్రిగర్త, భగదత్తులూ, మరికొందరూ కృష్ణద్వేషులు. అంగ, వంగ, విదేహ, కాశ, కరూశ, మద్ర, పాండ్య మొదలైన దేశాల రాజులు కూడా జరాసంధుడి పక్షాన పోరాడటానికి సిద్ధంగా ఉన్నారు. తిరిగి ఇరవైఒక్క అక్షౌహిణీల సేన సమకూడింది. వాళ్ళు అంచె ప్రయాణాల మీద మధురానగరాన్ని చేరవచ్చి, నగరం చుట్టూ ఉండే తోటలలో యమున పొడుగునా విడిశారు.

కృష్ణుడు మొదలైనవాళ్ళు కోట గోడ లెక్కి చూస్తే జరాసంధుడి సేన ప్రళయానికి ముందుండే సముద్రం లాగా కనబడింది. కృష్ణుడు బలరాముణ్ణి చూసి నవ్వుతూ, "భూభారం తగ్గించటానికి దేవుడీ ఏర్పాటు చేసినట్టున్నది," అన్నాడు.

ఇద్దరూ కలిసి సేనలతో శత్రువును ఎదిరించటానికి నిశ్చయించారు.

జరాసంధుడు తన వెంట వచ్చిన రాజులతో తన యుద్ధ తంత్రం ఈ విధంగా చెప్పాడు. వెంటనే సేనలు మధురా నగరాన్ని చుట్టుముట్టాలి. గునపాలతో కోట గోడలు అక్కడక్కడా బద్దలు కొట్టాలి. నగరాన్ని పూర్తిగా నాశనం చెయ్యాలి.







గోమంతపర్వతాన్ని చుట్టుముట్టినప్పుడు ఎవ రెవరు ఏయే దిక్కులలో నిలబడ్డారో, అదేవిధంగా మధుర చుట్టూ కూడా నిలబెట్టాడు జరాసంధుడు.

ఈసారి యాదవులు జరాసంధుడితో యుద్ధమంటే జంకలేదు. నిజానికి జరాసంధుడి బలాలముందు తమ బలాలు ఎందుకూ పనికిరావు, కాని తమ వెంట కృష్ణుడున్నాడు. అదే వారి ధైర్యం. గరుత్మంతుడి జెండా గల రథంలో చక్రం మొదలుగా గల ఆయుధాలు పెట్టుకుని కృష్ణుడూ, నాగలి, రోకలి మొదలైన ఆయుధాలు వెంటబెట్టుకుని బలరాముడూ యుద్ధానికి వస్తుంటే చాలా కనులపండువుగా కనిపించింది. వాళ్ళిద్దరూ ఉగ్రసేనుడితోసహా తమ సేనకు ముందుండి నడుస్తూ, జరాసంధుడి సేనను సమీపించారు. తన సేనకు ముందు నిలబడి ఉన్న జరాసంధుడు వాళ్ళను ఎదుర్కొని, కృష్ణుడి పక్కనే ఉన్న ఉగ్రసేనుడితో, "భోజవంశం వారు రాజ్యాలేలితే, యాదవులు వారికి సేవచేస్తారు. అలాటి భోజవంశంలో పుట్టి కూడా నువు వంశ ప్రతిష్ఠ పోగొట్టుకున్నావు. నీ కన్న మూర్ఖుడుంటాడా? ఈ కృష్ణుడు నీ కొడుకును చంపి రాజ్యం కాజేసి, ఉత్త సింహాసనం మటుకు నీ కిచ్చాడు. వాడు పెట్టే పిండాకూడు తింటున్నావు. ఎందుకు? ఏళ్ళు వచ్చాయి! నీదీ ఒక జన్మేనా? సిగ్గులేక ఈ భోగం ఎలా అనుభవిస్తున్నావు? కృష్ణుడికి నువు బంటువు తప్ప రాజువు కావు," అన్నాడు.

కృష్ణుడిది విని మండిపడి, "గౌరవనీయుడైన ఉగ్రసేనుణ్ణి నిందించటంలోనే ఉన్నదా ఏమిటి నీ పౌరుషం? ఏమైనా అనదలిస్తే నన్నే అను. నీకు నేనేగదా అసలు విరోధిని? ఆ రోజు గోమంతం దగ్గిర నాతో యుద్ధం చేసినవాడవేగదా. హాస్యాస్పదంగా మాట్లాడకు. ఈసారైనా పారిపో





కుండా నిలిచి యుద్ధంచెయ్యి, నా ప్రతాపం పూర్తిగా చూతువుగాని," అంటూ జరాసంధుణ్ణి, సారథినీ బాణాలతో కొట్టి, అతని విల్లు విరగగొట్టాడు.

ఉభయపక్షాల వీరుల మధ్యా తీవ్రంగా యుద్ధం సాగింది. ఈ యుద్ధంలో ఉగ్రసేనుడు కూడా గొప్ప పరాక్రమం ప్రదర్శించాడు. ఒకసారి కృష్ణుడికీ రుక్మికీ ద్వంద్వ యుద్ధం జరిగింది. అందులో రుక్మి చిత్తుగా ఓడి తప్పుకు పోయాడు.

బలరాముడు చెలరేగి తన పక్షంవాళ్ళను మందను తోలినట్టు తోలటం చూసి జరాసంధుడు అతన్ని ప్రతిఘటించాడు. ఇద్దరూ ఒకరి రథాలొకరు ధ్వంసం చేసుకుని, గదా యుద్ధానికి దిగారు. వాళ్ళ యుద్ధం చూడటానికి మిగిలినవాళ్ళంతా యుద్ధం మానేశారు. వాళ్ళిద్దరూ ఒకరి దెబ్బలు ఒకరు తప్పించుకుంటూ, ఒకరి నొకరు గదలతో మోదుకుంటూ, రక్తధారలు కార్చుతూ, భూమి దద్దరిల్లేలాగా, రెండు పెద్ద పులుల మాదిరి యుద్ధం చేశారు. చివరకు ఎవరిని ఎవరూ చంపకుండానే ఆ గదా యుద్ధం ముగిసింది.

ఈ విధంగా కొన్ని రోజులపాటు యుద్ధం జరిగింది. జరాసంధుడు కోరిన విధంగా అతనికి విజయం లభించలేదు. అతని బలాలు రోజు రోజుకూ క్షీణిస్తున్నాయి. అతను ప్రాణం విసిగి, దైవం తనకు అనుకూలించటం లేదనుకుని, తన పక్షాన వచ్చిన రాజులనూ, సేనలనూ వెంట బెట్టుకుని మగధకు తిరిగిపోయాడు.

కాని జరాసంధుడు అంతటితో వదలలేదు. ఇదేవిధంగా అతను మధుర మీదికి పద్దెనిమిదిసార్లు దండెత్తి వచ్చాడు. కృష్ణుణ్ణి చంపటం జరాసంధుడి వల్లా కాలేదు, జరాసంధుణ్ణి చంపటం కృష్ణుడి వల్లా కాలేదు. కారణం, జరాసంధుడు మరొకరి చేతిలో చావవలిసి ఉన్నాడు.

రోజులు సుఖంగా గడుస్తున్నాయి. బల రాముడికి తన చిన్ననాటి విషయాలన్నీ జ్ఞాపకం వచ్చి, ఒకసారి గోకులం చూడా లనిపించింది. కృష్ణుడితో చెబితే అతన్ని వెళ్ళిరమ్మన్నాడు; కాని తాను బయలుదేర లేదు. బలరాముడు అరణ్యప్రాంతాలకు తగిన వేషం వేసుకుని వ్రేపల్లెకు వెళ్ళాడు. అతన్ని అంత దూరంలోనే చూసి గోపకులు పరమానందంతో ఎదురు వెళ్ళారు. బల రాముడు కొందరికి దణ్ణాలు పెట్టాడు, కొందరి చేత పెట్టించుకున్నాడు, మరి కొందరిని కౌగిలించుకున్నాడు. గోపిక లందరూ అతని చుట్టూ మూగితే వారం దరినీ ప్రేమగా పలకరించాడు.

వృద్ధగోపులు అతన్ని తమ మధ్య కూర్చోబెట్టుకుని ఇష్టాగోష్ఠి జరిపారు.

"నాయనా, నువు రావటం గొప్ప విశేషం. ఎటువంటి వాళ్ళకైనా జన్మస్థలం మీద ప్రేమ పోదనటానికి ఇంతకంటె ఏం నిదర్శనం కావాలి? మీ అన్న దమ్ములు చాణూరముష్టికులను చంపారు, కంసుణ్ణి హతమార్చారు, గోమంతం దగ్గిర మహా సేనను జయించారు, సృగాల వాసుదేవుణ్ణి చంపారు, ఎంతో కీర్తి సంపాదించారు. అయినా నువు గోవులను కాచిన చోటు వెతుక్కుంటూ వచ్చావు!" అన్నారు గోపవృద్ధులు.

"మీరు పెంచబట్టేగదా మాకీ ఖ్యాతి వచ్చింది? మీవంటి బంధువులు కావాలంటే మటుకు దొరుకుతారా? నాకూ, నా తమ్ముడికీ ఆ రాజభోగాల మీద మనసు పోదు. ఇక్కడ చిన్నతనంలో గడిపిన రోజులు మరుద్దామన్నా మరపలేం," అన్నాడు బలరాముడు.

ఈ మాటకు అందరూ సంతోషించి అతను తాగటానికీ, తినటానికీ ఉత్తమమైన పానీయాలూ, భక్ష్యాలూ పెట్టి ఎంతో ప్రేమతో ఆదరించారు.





# అరణ్యపురాణం

## 17

ఇద్దరు బలమైన మర్కటులు మౌగ్లీని తమ చంకల కింద గట్టిగా పట్టుకుని, చెట్ల పై భాగాల మీదుగా, తడవకు ఇరవయ్యేసి అడుగులు దూకుతూ పరిగెత్తుతున్నారు. మౌగ్లీ బరువు లేకపోతే వాళ్ళు రెట్టింపు వేగంతో వెళ్ళగలరు. ఆ వేగానికి మౌగ్లీకి తల తిరిగి పోతున్నది. అడుగున ఎక్కడో ఉన్న నేల కేసి చూస్తే గుండె గుబగుబలాడుతున్నది. కాని గాలిలో అతివేగంగా ఎగిరిపోతున్న ఆనందం లేకపోలేదు. ఒక్కొక్కసారి చెట్ల చిటారు కొమ్మలకు పోతూ, అవి తమ బరువు మోయలేనప్పుడు పెద్ద కేకపెట్టి, గద్దల్లాగా వాలి, మరొక చెట్టు కింది కొమ్మలను, కాళ్ళతోనో, చేతులతోనో; వీలునుబట్టి అందుకుంటూ మర్కటులు ప్రయాణిస్తున్నారు. ఒక్కొక్కసారి, ఎత్తయిన చిటారు కొమ్మల నుంచి మౌగ్లీకి అరణ్యం అనేకమైళ్ళు చుట్టూ విస్తరించి కనబడుతున్నది. పై కొమ్మల కెక్కుతూ, కింది కొమ్మలకు దూకుతూ, కేరింతాలు కొడుతూ, రంకెలు పెడుతూ, మౌగ్లీని బందీగా చిక్కించుకున్న వానరులు చెట్ల మీదుగా ఉండే తమ మార్గాన అతి వేగంగా పోసాగారు.

మౌగ్లీకి మొదట కలిగినది భయం— తనను మర్కటులు కింద జారవిడుస్తారేమోనని. తరవాత అతనికి ఆగ్రహం వచ్చింది; కాని తొందరపడి పెనుగులాడాడు కాడు. ఆ తరవాత అతను ఆలోచించనారంభించాడు.

వెంటనే జరగవలిసిందేమంటే భాలూకూ, బాఘీరకూ వర్తమానం పంపటం. ఈ కోతుల వేగాన్ని వాళ్ళు అందుకోలేరు. వర్తమానం ఎవరు చేర

అట్ట చివరి బొమ్మ



పోయే మర్కటుల మార్గాన్ని అనుసరించ సాగాడు. "నేను వెళ్ళే దారి గుర్తుంచుకుని, భాలూకూ, బాఘీరకూ, శిఖరం మీది మందకూ చెప్పు," అని మౌగ్లీ డేగభాషలో కేక పెట్టాడు.

"నీ పేరేమిటి, తమ్ముడూ?" అన్నాడు డేగన్న. అతనికి అప్పటి కింకా మౌగ్లీ పరి చయం కలగలేదు.

"మౌగ్లీ. అందరూ నన్ను కప్పాయ్ అని పిలుస్తారు," అన్నాడు మౌగ్లీ.

డేగన్న అవ్వాయిచువ్వా లాగా ఆకాశం లోకి లేచి చిన్న చుక్కలాగా కనిపిస్తూ, మర్కటులు వెళ్ళే దారి గమనించాడు.

వేస్తారు? కిందికి చూస్తే ఆకులూ, కొమ్మలూ తప్ప మరేమీ కనిపించటం లేదు. మౌగ్లీ నీలాకాశంలోకి చూశాడు. అరణ్యంలో ఏ ప్రాణి అయినా చస్తుందా అని చూస్తూ, డేగన్న ఆకాశంలో చక్కర్లు కొడుతున్నాడు.

మర్కటులు దేన్నో చేర వేస్తూండటం డేగన్న చూడనే చూశాడు. చూసి, అది తిన టానికి పనికి వస్తుందేమోనని, కొన్ని వందల గజాలు దిగివచ్చాడు. దగ్గిరిగా వచ్చేసరికి మౌగ్లీ కనిపించాడు; డేగ భాషలో మౌగ్లీ, "మనమూ, మనమూ ఒకటే," అన్న పలక రింత కూడా వినపడింది. డేగన్న ఆశ్చ ర్యంతో కూత వేసి, మౌగ్లీని మోసుకు

ఈ లోపల భాలూ, బాఘీరా పొందిన ఆగ్రహం వర్ణనాతీతం. బాఘీర ఎన్నడూ ఎగబాకని ఎత్తులకు చెట్లు ఎగబాకాడు. అతని బరువు మొయ్యలేక కొమ్మలు పెళ పెళా విరిగాయి. అతని గోళ్ళ నిండా చెట్ల బెరడు ఇరుక్కున్నది. అతను తన ఆగ్ర హాన్ని భాలూ మీద వెళ్ళగక్కుతూ, "మౌగ్లీని ముందే ఎందుకు హెచ్చరించావు కావు?" అన్నాడు.

"త్వరగా! త్వరగా పోతే వాళ్ళను అందుకోగలమేమో!" అన్నాడు భాలూ రొప్పుతూ పరిగెత్తుతూ.

"నీ పరుగుకా? ఇంకో మైలు పరిగెత్తా వంటే పండుపగిలినట్టు పగిలి పోగలవు! స్థిమితంగా కూర్చుని ఆలోచించు. కుర్ర వాళ్ళను మొట్టికాయలు వేసినట్టు కాదు. మనం వెన్నంటామంటే వాళ్ళు వాణ్ణి జార విడిచెయ్యగలరు!" అన్నాడు బాఘీర.

"అయ్యో, బాబోయ్! జార విడవటమే!" అంటూ భాలూ నెత్తిన చేతులు పెట్టుకుని, వేదనతో అటూ ఇటూ ఊగసాగాడు.

"ఊరుకో, భాలూ. అట్లా శోకాలు పెడితే చూసినవాళ్ళు ఏ మనుకుంటారు? నే నే నీలాగ రోదనం ప్రారంభించాననుకో—" అని బాఘీర మందలించాడు.

"ఎవ రే మనుకుంటే నాకేం? వా డీ పాటికే చచ్చిపోయాడేమో!" అంటూ భాలూ చేతులు వూపుతూ తనను తాను వైనవైనాలుగా తిట్టుకున్నాడు.

అంతలోనే భాలూ ఊగటం మానేసి నిటారుగా నిలబడ్డాడు. అతని కొక ఆలోచన వచ్చింది.

"మనం కొండచిలువ కావా దగ్గిరికి పోదాం. అతనంటే కోతులకు హడలు! అతను మర్కటులంత వేగంగానూ కదల గలడు, చెట్లెక్కగలడు. రాత్రివేళ వచ్చి వాళ్ళ పిల్లలను తినేస్తూ ఉంటాడు," అన్నాడు భాలూ.



"పాపిష్టి కళ్ళు! కాళ్ళు అసలే లేవు! మన జాతేకాదు—వాడు మనకేం సహాయం చేస్తాడు?" అన్నాడు బాఘీర అనుమానంగా.

"వాడు అనేక కాలాలు చూసినవాడు, మహా జిత్తులమారి. ఎప్పుడూ ఆకలి మీదనే ఉంటాడు. బోలెడన్ని మేకలను ఇస్తామందాం," అన్నాడు భాలూ.

"కడుపులో ఎత్తు పడితే నెలపాటు నిద్ర పోతాడు. నిద్రలో ఉన్నాడేమో? ఒకవేళ మేలుకునే ఉన్నా, మీ మేకలు ఎవడికి కావాలి అంటే?" అన్నాడు బాఘీర అనుమానంగా.

నిజానికి బాఘీరకు కావా గురించి దాదాపు ఏమీ తెలీదు.

"నువ్వూ, నేనూ అంత చాతకాని వాళ్ళమా ఏమిటి?" అన్నాడు భాలూ, తన భుజాన్ని బాఘీర కేసి రుద్దుతూ.

ఇద్దరూ కలిసి కొండచిలువ కావాను వెతుక్కుంటూ బయలుదేరారు.

కావా వాళ్ళకు ఒక వేడెక్కిన రాతి మీద మధ్యాన్నపు ఎండలో పడుకుని కనిపించాడు. అతను గత పది రోజుల లోపల కుబుసం విడిచి, నిగనిగలాడే కొత్త చర్మంతో చాలా అందంగా ఉన్నాడు. ఆరు బారల నిడివి గల అతని శరీరం మెలికలు తిరిగి పోతున్నది. అతను ఆహారం గురించి ఆలోచిస్తూ పెదవులు నాక్కుంటున్నాడు.

భాలూ కావాను అంత దూరాన చూస్తూనే బాఘీరతో, "ఆకలి మీద ఉన్నాడు. ఇంకా కడుపులో ఎత్తు పడలేదు. జాగ్రత్త సుమా! కుబుసం విడిచిన కొత్తలో అతనికి దృష్టి సరిగా ఆనదు. దానితోబాటు తొందరపాటు కూడా హెచ్చు," అని హెచ్చరించాడు.

కావా విషసర్పంకాడు. విషసర్పాలు పిరికివాళ్ళని అతనికి వాళ్ళంటే ఏవగింపు కూడాను. అతనిలో అపాయకరమైనది అతని కౌగిలింత. ఆ కౌగిలింతకు చిక్కి బయటపడిన ప్రాణి లేదు.



# 71. బైకాల్ సరస్సు

సైబీరియా (రష్యా)లో ఉండే బైకాల్ సరస్సు ప్రపంచంలోని సరస్సు లన్నిటిలోకి అత్యంత ప్రాచీన మైనది. సాధారణంగా ప్రపంచంలోని సరస్సులన్నీ 10, 15 వేల ఏళ్ళ క్రితం ఏర్పడినవి; కాని బైకాల్ 2 కోట్ల ఏళ్ళ క్రితం ఏర్పడినది. విస్తీర్ణాన్నిబట్టి చూస్తే, ఇది ప్రపంచంలోని గొప్ప సరస్సులలో అరవది అవుతుంది. దీని విస్తీర్ణం 12,150 చదరపు మైళ్ళు. కాని ఇంత లోతైన సరస్సు మరొకటి లేదు. దీని లోతు 1620 మీటర్లు (ఇంచు మించు ఒక మైలు). సాధారణంగా సముద్రంలో తప్ప జీవించని అనేక ప్రాణులు ఇందులో జీవించటంవల్ల, ఈ సరస్సు ఉత్తరధ్రువ సముద్రంతో సంధానం కలిగి ఉన్నదనుకునేవారు. ఈ సరస్సులో 1800 రకాల ప్రాణిజాతు లున్నాయి. ఇందులో 75 శాతం ప్రపంచంలో మరెక్కడా లేవు. ఇందులో అనేక సముద్రప్రాణులు జీవిస్తున్నప్పటికీ దీనిలోని నీరు తియ్యనిదే. ఏటా ఈ సరస్సులో 10 వేల టన్నుల మేలు జాతి చేపలు దొరుకుతాయి. అనేక వైజ్ఞానిక విభాగాలకు చెందిన పరిశోధకులు ఇక్కడికి వచ్చి పరిశోధనలు జరుపుతారు. ఈ ప్రాంతం ఎంతో నేత్రపర్వంగా ఉంటుందట. 300 నదులు, చుట్టూ ఉన్న కొండల నుంచి ఈ సరస్సులోకి ప్రవేశిస్తాయి. కాని "అంగార" అనే నది ఒక్కటే దీని నుంచి బయలుదేరుతుంది.



Photo by N. Ramakrishna



బహుమతి
పొందిన వ్యాఖ్య

కదిలిస్తే గలగల

పంపినవారు :
ఎం. ఎ. మొహిద్దీన్, భీమవరం

Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

కదలకనే కిలకిల

పంపినవారు:
ఎం. ఎ. మొహిద్దీన్, భీమవరం

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కదిలిస్తే గలగల

రెండవ ఫోటో : కదలకనే కిలకిల

పంపినవారు : ఎం. ఎ. మొహిద్దీన్,

క్లర్క్, ఎ. పి. ఎస్. ఆర్. టి. సి., భీమవరం.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

ఇంజనీరు కావాలని అతడు కలలు
కంటున్నాడు. మీరు ఆ కలను
నిజంచేయగలరా? పంజాబ్ నేషనల్
బ్యాంక్‌లో సేవింగ్స్ అక్కౌంట్‌ను
ప్రారంభిస్తే మీరు దీనిని పొందగలరు.

నేడే ఖాతా ప్రారంభించండి. నెలనెలకీ
అతనికోసం ఆదా చేయండి. రికరింగ్
డిపాజిట్ స్కీముక్రింద మీకు ఎంత లాభం
చేకూరగలదో కూడా అడిగి తెలుసుకోండి.

# పంజాబ్ నేషనల్ బ్యాంక్



# యుక్తి గల ఫొటోగ్రాఫీ కొరకు

## గెవాబాక్స్!

ఎందుచేతనంటే గెవాబాక్స్‌లో లక్షణములు అద్భుతంగా కలిసి వున్నాయి —

పెద్ద దీర్ఘ చతురస్రాకారపు చిత్రములు, 6 సెం.మీ. × 9 సెం.మీ. — ఆ తరగతి వాటితో పోల్చగల కెమేరాల నుండి వచ్చేవాటి కంటే పెద్దవి.

దృఢమైన, అందమగు బోడీ పూర్తిగా అత్యుత్తమమైన స్టీల్‌తో చెయ్యబడినది.

3 స్పీడ్‌లు (బల్బ్ 1/50వ మరియు 1/100వ సెకండ్‌లు) ఆటలు, పిక్‌నిక్‌లు, పార్టీలలో ఆకర్షణీయమగు దృశ్యములను తీసుకోండి.

ఇతర విశేషములు! శ్రేష్ఠమైన ఫొటోగ్రాఫ్‌ల కొరకు స్పష్టమగు అయ్.లెవెల్ వ్యూఫైండర్ • 'ఫోకసింగ్ లెన్స్' కొరకు 2 ఎపర్చర్‌లు (f 11 మరియు f 16)




**ఫొటోగ్రాఫీని తెలుసుకోండి**

— ఫొటోగ్రాఫీ ఎటువంటి సరదా అంటే అది మీకు ఏ సమయంలోనైనా చిత్రసంకలనం వలన గడచిన విషయాలను జ్ఞాపకం చేసి సాటిలేని ఆనందాన్నిస్తుంది.

# గెవాబాక్స్

గెవాబాక్స్ — ప్రొఫెషనల్ చిత్రములను తీసే ప్రజాదరణ పొందిన కెమేరా!

ఖరీదు రూ. 44/- స్థానిక పన్నులు అదనం

గెలవండి రూ. 100!

అగ్ఫా-గెవార్ట్ ఫొటోగ్యాలరీలో వివరములు లభిస్తాయి. 6 ఉచిత కాపీల కోసం (రూ. 1/- పోస్టేజ్‌కి పంపుతూ) వీరికి వ్రాయండి —




అగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
కస్తూరి బిల్డింగ్, జమ్‌షెడ్జీ టాటా రోడ్, బొంబాయి 1.

507D TL



దిలీప్ బృందం
దీవికి పిక్నిక్
ఆరే, ఇంత ఆలశ్యం అయిందని అనుకోనే లేదే! మనం త్వరత్వరగా సర్దుకుని తిరిగి వెళ్ళిపోవాలి.
సార్, సార్ పడవలేదు!
తాడు వూడిపోయి కొట్టుకు పోయివుంటుంది. అయితే, అలలు ఈ వైపు కేవున్నాయి. కాబట్టి ఎంతో దూరం వెళ్ళివుండదు.
బాగా చీకటి పడింది. గాలి జోరుగా వుంది. అగ్గిపుల్లలు వెలిగించి లాభంలేదు.
ఆదుర్దాపడకండి. నా దగ్గర 'ఎవరెడి' టార్చి వుంది! పడవ ఎక్కడుందో వెంటనే కనిపెడ్దాం.
ఆ, అదిగో అక్కడుంది! దిలీప్, పడవపై టార్చి ఫోకస్ చేసివుంచు. మేము ఈదుకుంటూవెళ్ళి అందుకుంటాము.
అదిగో. దగ్గరకు చేరుకుంటున్నారు. ....
పడవలోకి ఎక్కుతున్నారు. హమ్మయ్య, బ్రతికాం!
అద్భుతం.
నా 'ఎవరెడి' టార్చికి ధన్యవాదాలు

CHANDAMAMA (Telugu) OCTOBER 1967 Regd. No. M. 4854




అరణ్యపురాణం